# ధమ్మయాత్ర

(బుద్ధభూమి మాసపత్రికలో
జూలై 2015 నుంచి డిసెంబర్ 2015 వరకూ
ధారావాహిక )

బెందాళం క్రిష్ణారావు

బుద్ధ పూర్ణిమ : 2021

వెల : ధమ్మ ప్రచారాభిలాష మాత్రమే

ప్రచురణ :

ప్రజ్ఞ మీడియా – శ్రీకాకుళం

# : ధన్యవాదములు :

మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో 2015 ఫిబ్రవరి 28 నుంచి మార్చి 7వ తేదీ వరకూ జరిగిన ఆరవ ధమ్మయాత్ర విశేషాలు ఇవి.

ఈ ధమ్మయాత్రలో నన్ను భాగస్వామిని చేసినందుకు బుద్ధవిహార ఛైర్మన్ రేకా కృష్ణార్జునరావు, కార్యదర్శి పామర్తి రవి గార్లకు ఇతర బృందానికి ధన్యవాదములు

\- బెందాళం క్రిష్ణారావు

# మనవి మాటలు

ఆరేళ్ల కిందట  2015లో చేసిన ధమ్మయాత్ర విశేషాలు ఇప్పుడు ఎందుకని చదువరుల్లో సందేహం రావడంలో అశ్చర్యం లేదు. ఆ విశేషాలు అప్పట్లోనే మంగళగిరి కేంద్రంగా వెలువడు తున్న ఏకైక తెలుగు బౌద్ధధమ్మ మాసపత్రికలో 2015 జూలై సంచిక నుంచి డిసెంబర్ సంచిక వరకూ ధారావాహికంగా ప్రచురితమైనాయి. పలువురి ప్రశంసలు అందుకున్నాయి. ఆ సమయ ంలో చదివిన వారికి మళ్లీ గుర్తుచేస్తూ చదవనివారికి సరికొత్తగా ఈ విశేషాలు వివరించే ప్రయ త్నంలో భాగంగా ఇలా పుస్తకరూపంలో తీసుకువచ్చాను. వివిధ ప్రక్రియల్లో రచనలు చేసినా యాత్రారచనగా ఇది నా తొలిప్రయత్నం.

మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో విహార అధ్యక్షులు రేకా కృష్ణార్జునరావు, కార్యదర్శి పామర్తి రవి  ధమ్మ మిత్రులను పలు పర్యాయాలు ధమ్మయాత్రకు తీసుకువెళ్లడం పరిపాటి. బౌద్ధ ధార్మిక ప్రదేశాలను స్వయంగా దర్శించి అక్కడి విశేషాలను తెలుసుకుని బౌద్ధ ధమ్మంపై ఆసక్తిని పంచుకుని అవగాహన పెంచుకోవడానికి ఈ యాత్రలు ఎంతగానో ఉపకరిస్తాయి.     ఈ దే శంలోని బౌద్ధ క్షేత్రాలు మాత్రమే కాకుండా శ్రీలంక, నేపాల్, భూటాన్ వంటి విదేశాలకు కూడా ఈ విహార ఆధ్వర్యంలో ధమ్మయాత్రలు జరిపారు.  నేను ధమ్మమిత్రుల బృదంలో ఒకనిగా ఆరవ ధమ్మయాత్రలో పాల్గొన్నాను.

అప్పటికి శ్రీకాకుళంలో ఉంటున్న నేను విజయవాడ చేరుకుని అక్కడ్నుంచి ధమ్మ మిత్రుల తో కలిసి అజంతా,  ఎల్లోరా,  సాంచి, నాగపూర్ ప్రాంతాలకు సాగించిన యాత్రా విశేషాల అనుభవాలు ఈ పుస్తకం ద్వారా మీతో పంచుకుంటున్నాను. నా గత పుస్తకాలవలే ఈ పుస్తకాన్ని కూడా ఆదరించి సద్విమర్శలతో మరింతగా తోడ్పడగలరని ఆకాంక్ష.

*శ్రీకాకుళం* — *బెందాళం క్రిష్ణారావు*

***26-5-2021***

*బుద్ధ పూర్ణిమ*




## అంధ్రా నుంచి అజంతాకు

**శ్రీకాకుళం నుంచి ఒంగోలు వెళ్తున్న ఆర్టీసీ బస్సు....2015 ఫిబ్రవరి 27వ తేదీన సాయంత్రం ఏడు గంటలకు మొదలైన నాప్రయాణం తర్వాతరోజు ఉదయం ఐదున్నర గంటలకే విజయవాడ చేరుకునేసరికి తొలి రోజు ధమ్మయాత్రకు సిద్ధమైంది.**

**మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో ఆరవ ధమ్మయాత్ర కోసం ధమ్మ మిత్రులమంతా ఫిబ్రవరి 28న ఉదయం ఎనిమిదిన్నర గంటలకు విజయవాడ రైల్వేస్టేషన్‌లో కలుసుకున్నాం. పరస్పర పరిచయాలు అయ్యాక కొంత సమయం తర్వాత పదిన్నర గంటలకు**

వచ్చిన ట్రైన్‌లో ఔరంగాబాద్ బయలుదేరాం. మరుసటిరోజు ఔరంగాబాద్ రైల్వే స్టేషన్ లో ట్రైన్‌దిగి ఎల్లోరాలో బసచేసి ఎల్లోరా గుహలు, ఔరంగాబాద్ సందర్శనం మా తొలి రోజు  యాత్రలో మేము ముందుగా సిద్ధం చేసుకున్న ప్రణాళిక, అయితే కొన్ని అనివార్యకారణాల వలన కొంచెం మార్పులు తప్పలేదు. పద్దెనిమిది మంది ధమ్మ మిత్రులం ఉన్న ఈ  బృందంలో విజయవాడ నుంచి పదహారు మందిమి మాత్రమే ట్రైన్ ఎక్కాము. మిగిలిన ఇద్దరు ధమ్మ మిత్రలు వరంగల్‌లో మాతో కలిసారు. మా బృందానికి బుద్ధభూమి మాసపత్రిక సంపాదకులు రేకా కృష్ణార్జునభోధి, మంగళగిరి బుద్ధవిహార కార్యదర్శి పామర్తి  రవి నేతృత్వం వహించారు. రైలుప్రయాణం తొలిరోజు ఎంతో ఆహ్లాదకరంగా జరిగింది.   మాతోపాటు తీసుకొచ్చిన పులిహార, ఫ్రైడ్‌రైస్, పెరుగన్నం తదితర ఆహార పదార్థాలు  ఎంతో రుచికరంగా ఉన్నాయి. రైల్లో ఎటువంటి ఆహారపదార్థాలు కొనుక్కుని తినకూడదని ముందుగానే నియమం పెట్టుకోవడంతో అందరం ఆరోగ్యంగా ఉండగలిగాం.    మార్చి1వ తేదీ ఉదయం ఐదు గంటలకే ఔరంగాబాద్ రైల్వే స్టేషన్‌లో  దిగాం. స్టేషన్ నుంచి బయటకు వచ్చేసరికి ముందుగానే ఏర్పాటు చేసుకున్న మినీ బస్ మాకోసం  సిద్ధంగా ఉంది. చిరుజల్లులు పడుతున్నాయి.



రైల్లో వస్తున్నప్పుడే అజంతా, ఎల్లోరాకు సంబంధించిన పుస్తకాలను పరిశీలనగా చదవడంతో సోమవారం నాడు అజంతా గుహల సందర్శనకు సెలవు ఉంటుందని తెలిసింది. ఎల్లోరాలో బసచేసి తొలిరోజు ఆదివారం ఎల్లోరా గుహలు సందర్శించి తర్వాత రోజు సోమవారం అజంతా గుహల సందర్శనకు వెళ్లాలన్నది మా ప్రణాళిక. అయితే సోమవారం ఆజంతా గుహల సందర్శన వీలుపడదని తెలిసినతర్వాత పర్యటనలో స్వల్పమార్పులు చేసుకున్నాం. ఆదివారమే అజంతా వెళ్లాలని నిర్ణయించుకున్నాం. రైల్వే స్టేషన్‌నుంచి బస్సులో మా బస ఏర్పాటు చేసిన ఆశ్రమఅతిథిగృహానికి చేరుకున్నాం. అక్కడే కాలకృత్యాలు తీర్చుకున్నాం. అల్పాహారం, మధ్యాహ్నభోజనాన్ని అక్కడే తయారు చేసుకుని మాతో బస్సులో తీసుకువెళ్లాలని నిర్ణయించుకున్నాం. అయితే సుమారు వంద కిలోమీటర్ల దూరం ప్రయాణించాల్సివస్తుండడంతో సమయం సరిపోదని భావించి ఆ ప్రయత్నాన్ని విరమించాం. అజంతా బయలు దేరాం. మా బసచేసిన అతిథి గృహానికి దగ్గరలోనే ఉన్న గరికపాటి వారి హొటల్‌లో రుచికరమైన అంధ్రా అల్పాహారాన్ని చేసాం. ఎల్లోరా నుంచి అజంతా వరకూ సుమారు రెండున్నర గంటల పాటు జరిగిన

బస్సు ప్రయాణంలో అజంతా విశేషాల గురించి బస్సులో ఉన్న మైక్‌ద్వారా కృష్ణార్జునబోధి, నెల్లూరు జిల్లా ఉదయగిరి నుంచి వచ్చిన లియాఖత్ ఆలీ మాట్లాడారు. మంగళగిరికి చెందిన చిలకా వెంకటేశ్వరరావు పాటలు పాడారు. నేను అజంతా గుహల ప్రత్యేకత గురించి వివరించాను. సుమారు వెయ్యి సంవత్సరాలపాటు పశ్చిమ పర్వత శ్రేణిలో గల దట్టమైన అరణ్యంలో ఈ గుహలు కప్పబడిపోయాయి. 1819లో ఇవి యాదృచ్ఛికంగా బయటపడ్డాయి.



మా బస్సు అజంతా చేరుకునేసరికి మధ్యాహ్నం ఒంటిగంట అయ్యింది. మాతో పాటు తీసుకువెళ్లిన అల్పాహారాన్ని తిని అక్కడే మా బస్సును పార్కింగ్ స్థలంలో విడిచి పెట్టేశాం. అక్కడ నుంచి అజంతా గుహల వరకూ వెళ్తున్న ప్రత్యేక బస్సును ఎక్కాం. ఔరంగాబాద్ నుంచి అజంతా వరకూ వర్షం చిరుజల్లుల రూపంలో మమ్మల్ని వెంటాడుతోనే ఉంది. అజంతా గుహలను చేరుకునేసరికి కూడా వర్షం పడుతూనే ఉంది. ఆవర్షంలో దూరంగా సుమారు 250 అడుగుల ఎత్తులో గుర్రపునాడా అకారంలోగల కొండ చరియ మొత్తం అంతా కలిపి ఒకటే రాయిగా కన్పిస్తోంది. అందులోనే అజంతా గుహలున్నాయి. వీటిలో అతి ప్రాచీనమైనవి కూడా ఉన్నాయి. క్రీస్తు పూర్వపు కాలానికి చెందిన గుహలు కూడా ఉన్నాయి. మొత్తం ముప్పై గుహలు అందులో ఉన్నాయి. సాయంత్రంలోగా అన్ని గుహలనూ చూడగలమా అన్న సందేహం మమ్మల్ని వెంటాడింది. ఈ ముప్పై గుహల్లో అన్నీ చూడాల్సినవి కాదని, కొన్ని అసంపూర్ణ గుహలు కూడా ఉన్నాయని వాటిని విడిచిపెట్టి శిల్ప, చిత్ర కళతో అలరారే ముఖ్యమైన గుహలు చూస్తే సరిపోతు

ందని అనుకున్నాము.





పురావస్తు శాఖ ఏర్పాటు చేసిన కౌంటర్‌లో టిక్కెట్లు తీసుకుని లోపలకు అడుగు పెట్టాము. ఫోటోలు, వీడియో చిత్రీకరణకు ఆంక్షలు లేవని అయితే ఫ్లాష్‌ను మాత్రం ఉపయోగించకూడదని సెక్యూరిటీ సిబ్బంది మాకు ముందుగానే హెచ్చరించారు. మా బృందంలోని కెమెరామన్ నరసింహారావు తదనుగుణమైన ఏర్పాట్లుతో సిద్ధంగాఉన్నారు. అన్ని గుహలకూ మెట్లు ఉన్నాయి. అయితే అంచుల్లో నడవకూడదని, నిల్చోకూడదని హెచ్చరికబోర్డులు కూడా ఏర్పాటు చేసిఉన్నారు అక్కడ. అజంతా గుహల గురించి వివరిస్తూ భారతపురావస్తుశాఖ ఏర్పాటు చేసిన మాప్‌లు, గుహల చిత్రాల వివరాల బోర్డులు కూడా ఉన్నాయి. చిరుజల్లుల్లో తడుస్తూనే లోపలకు అడుగు పెట్టాము. అక్కడ రాసిఉన్న వివరాలను బట్టి పదహారు గుహల్లో కుడ్య చిత్రాలున్నాయి. మిగిలిన చక్కని పనితనాన్ని 1,2,16,17,19 నెంబర్లుతో ఉన్న గుహల్లో చూడవచ్చని రాసారు. 9,10,19,26,29

నెంబర్ల గుహలు చైత్య మండపాలు, మిగిలినవన్నీ విహారాలు. వీటి ప్రాచీనతను పరిశీలిస్తే భారతదేశంలో బౌద్ధంలో వచ్చిన వివిధదశలను ప్రతిబింబిస్తున్నాయని రాసి ఉంది. అక్కడే ఉన్న పురావస్తు శాఖ ప్రచురణల విభాగం సాయంత్రం ఐదు గంటల తర్వాత మూసివేస్తారని తెలుసుకుని ఆ సమయంలోగా అంతా చూసిరావాలనుకున్నాం నేనూ, ఆలీ. సెక్యూరిటీ చెకింగ్ అయ్యాక ధమ్మ మిత్రులమంతా ఒకటో నంబర్ గుహ వైపు నడిచాం



అజంతాలో మొదటి గుహకు చేరుకునేసరికి కూడా వర్షం పడుతూనే ఉంది. అజంతాలోని మొదటి గుహ విహార వాస్తుశిల్పకళకు అతిసునిశితమైన ప్రతీకగా కన్పించింది. దీని ముందు భాగం నగిషీ చెక్కడాలతో అత్యంత రమణీయంగా ఉంది. అతి సుందరంగా మలిచిన ఆరు స్తంభాలు వరండాలో అందంగా కన్పిస్తున్నాయి.ఈస్తంభాల దూలాలు అనురేఖన(ట్రేసరీ)కళ తోనూ, స్తంభాల పైభాగాన ఎగురుతున్న భంగిమల్లో విగ్రహాలను చెక్కారు.చక్కటి

నగిషీ పని తనం గల ఈ వరండాద్వారానే మొదటి గుహలోకి వెళ్లాము. చెప్పులను బయటే విడిపెట్టి అందరం లోపలికి నడిచాం. లోపలే గైడ్‌ను ఏర్పాటు చేసుకున్నాం. గైడ్ హిందీలో చెబుతూ ఉంటే ధమ్మమిత్రులు లియాఖత్ అలీ ఆయన చెప్పేదానిని తెలుగులోకి అనువదించి చెప్పారు.




ఈగుహ సుమారు **64** చదరపు అడుగుల వీస్తీర్ణంతో ఒక మందిరం లోని హాలువలే విశాలంగా ఉంది. వరండాలో ఉన్న స్తంభాలకున్నట్లే దీనికీ అలంకృత శిల్పాలున్నాయి. ఈ హాలులోకూడా వెనుకవరుసలోని మధ్య రెండు స్తంభాలు అత్యంత అందంగా ఉన్నాయి. ఈహాలులో ఇరువైపులా వరుసగా కొట్టాలవంటి గదులున్నాయి. ఇందులో ముందుగది తర్వాత ముఖద్వారానికి ఎదురుగా ఒక పెద్ద బుద్ధవిగ్రహం ఉంది. దానిని పక్కనే అతని ప్రథమశిష్యులైన పంచవర్గీయ బిక్షుల విగ్రహాలున్నాయి. వాటితోపాటు బుద్ధుని బోధనలు వినడానికి వచ్చిన సాధారణప్రజల విగ్రహాలు కూడా ఉన్నాయి. హాలులో కుడి

వరుసలోని మధ్యస్తంభంపై ఒక విచిత్ర ఆకృతి గణనీయమైన శైలిలో ఎంతో వాస్తవికంగా మలచబడి ఉంది. నాలుగు వేర్వేరు లేళ్లు వివిధ భంగిమల్లో ఉండి వాటన్నింటికీ ఒకే తల ఉన్నా, అది ప్రతీలేడికీ విడివిడిగా తల ఉన్నట్లు కన్పిస్తుండడవే ఇందులో ప్రత్యేకత.



ఇక్కడ గోడలూ పైకప్పూ ఒకప్పుడు రంగువేసినట్లు కన్పిస్తున్నా చాలా వరకూ అది ఊడిపోయింది. పైకప్పు రంగులతోనే చాలా చిత్రాలు ఊడిపోయాయి. అయితే ఇప్పటికీ మిగిలున్న చిత్రాలు కొన్ని అత్యుత్తమంగా కన్పిస్తున్నాయి. ఈ చిత్రాల్లో చాలా వరకూ జాతకకథల సన్నివేశాలున్నాయి. ముఖ్య ద్వారానికి ఎడమవైపున శిబి జాతక కథ గా గమనించవచ్చు. ఒక గ్రద్ద కు ఆహారం కానున్న పావురం బోధిసత్వుడైన శిబిరాజు శరణు జొచ్చింది. ఆపావురాన్ని వెంబడిస్తూ వచ్చిన గ్రద్ధ తాను వేటాడిన పావురాన్ని తనకు విడిపెట్టాలని శిబిరాజును కోరింది. దానికి ప్రత్యామ్నాయంగా శిబిరాజు పావురం బరువుకు

సరిపోయే  మాంసాన్ని తన శరీరం నుంచి గ్రద్ధకు ఇచ్చాడు. ఈ సన్నివేశాన్ని రాజుఒడిలో కూర్చొన్న పావురంగా అనాటి చిత్రకారులు ఇందులో చిత్రించారు.



ముందు గదిలోని పక్కగోడలపై బుద్ధుని జీవితంలో ప్రధానసంఘటనలను ప్రముఖంగా చిత్రించారు. ఈచిత్రాల్లో ఎడమవైపు ఉన్నదాన్లో ఏడేళ్ల అన్వేషణ తర్వాత గౌతముడు జ్ఞానసిద్ధి పొందుతున్న ఘడియను చిత్రీకరించారు. జ్ఞానాన్వేషణకై అంత:పురాన్ని విడిచి సన్యాస జీవితాన్ని ఆరంభించిన నాటి నుంచీ దుష్టుడైన మారుడు అతనిని వెంటాడుతూనే ఉంటాడు.“నీ సామ్రాజ్యపు పరిపాలనాచక్రం తిరిగి నీదౌతుంది. సన్యాసాన్ని విడిచిపెట్టు” అని ప్రలోభాని కి గురిచేస్తుంటాడు. అయినా సరే బుద్ధుడు చలించకుండా తన లక్ష్యసాధనకు ముందుకు సాగుతాడు. గౌతముడిని మరింత భయపెట్టాలనే సంకల్పంతో

మారుడు "నీమనసులోకి ఎప్పుడు ఎలాంటి దురాలోచన వచ్చినా నాకు తెలిసి పోతుంది.   జాగ్రత్త" అంటూ హెచ్చరిస్తాడు. అయినా గౌతముడు మారుడిని ఏమాత్రం లక్ష్యపెట్టకుండా తన మార్గంలో ముందుకు సాగుతాడు.



ఏడేళ్లపాటు మారుడు గౌతమున్ని నీడలా వెంటాడుతూనే ఉంటాడు. గౌతమునికి జ్ఞానోదయం కలిగే క్షణం అసన్నమైనప్పుడు మారుడు భయంతో కంగారుపడి తన చివరి ప్రయత్నం చేస్తాడు. బుద్ధుని జ్ఞానసాధనను భగ్నం చేయాలని తన స్వంత కూతుళ్లనే పంపిస్తాడు. ఈ ఇతివృత్తాన్ని చిత్రాల రూపం లో అనాటి చిత్రకారులు అతి రమణీయంగా చిత్రించారు. కుడివైపు గోడమీద మరో చిత్రం న్పిస్తుంది. ఈచిత్రం పేరు"శ్రావస్థిలోని అద్భుతం"గా చెబుతారు. ఈ చిత్రంలో బుద్ధుడు అనేక భంగిమల్లో గల బుద్ధునిగా వందల సంఖ్యలో కన్పిస్తాడు.  ముందుగదికి కుడి ఎడమ పక్కల్లో ఉన్న వెనుక వరండా గోడపై

రెండు బృహత్ బోధిసత్వుల చిత్రాలు కన్పిస్తాయి. ఇవి అజంతాలోని ప్రముఖ కళాఖండాలు. అంతర్జాతీయంగా కూడా ఇవి గుర్తింపు పొందాయి.



ఎడమవైపున పద్మపాణి బోధిసత్వుని చిత్రం ఉంది. తపోభంగిమలో అర్ధనిమీలిత నేత్రాలతో, ముఖంలో తొణికిసలాడే అలౌకిక ఆధ్యాత్మికశాంతితో సకలజీవరాసుల పట్ల గల దయకు ప్రతీకగా కన్పిస్తుందీ చిత్రం. ఈ గొప్ప చిత్రం ప్రపంచవ్యాప్తంగా ఎంతోమంది చిత్రకళావిమర్శకుల ప్రశంసలు పొంది ంది. బోధిసత్వుని పక్కన అతని భార్య, అజంతా శిల్పకళాకృతుల్లో తరచూ కన్పించే నీలసుందరి. ఎడమవైపు మూలన దేవతల విగ్రహాలు, కుడివైపున ఆనందంతో కేరింతలు కొడుతున్న కోతులూ నెమళ్లను చిత్రీకరించారు.



రెండవ బోధిసత్వుని చిత్రాన్ని వజ్రపాణి అంటారని గైడ్ చెప్పాడు. సర్వాలంకా రాలతో ప్రకాశిస్తున్న ఈ బోధిసత్వుడు ఒక సేవకునిపై విలాసంగా వయ్యారం గా అనుకుని ఉంటాడు. ఒకరాజు ఆతనికి పూవులుఅందిస్తున్నట్లుగా చిత్రంలో ఉంది. దిగువవైపు ఇద్దరు నల్లని రంగులో ఉన్న స్త్రీలుంటారు. ఈ చిత్రం చాలా వరకూ ఊడిపోయింది. కానీ ఇందులో అభివర్ణితమైన చిత్రాల నాజూకు తనం, లావణ్యం ఇంకా అందరినీ అకట్టుకుంటూనే ఉన్నాయి. గైడ్ సహకార ంతో ఈ విశేషాలన్నీ తెలుసుకున్నాం, ధమ్మమిత్రుడు నర్సింగరావు మమ్మల్నీ, గుహలోఉన్న శిల్పాలనీ, చిత్రాలనూ స్టిల్‌కేమెరాతో ఛాయాచిత్రాలుగా, వీడియో కెమెరాతో దృశ్యాలుగా చిత్రీకరించారు. గైడ్‌కు ధన్యవాదాలు చెప్పి కొంత

పారితోషికం ఇచ్చి మొదటి గుహ నుంచి బయటకు వచ్చాము. రెండో నంబర్ గుహవైపు అడులేసామంతా. ఇంకా వర్షం మాత్రం మమ్మల్నీ, అజంతానూ వెంటాడుతూనే ఉంది.



రెండో నంబర్ గుహ కూడా చాలా వరకూ ఒకటో నెంబర్ గుహనే పోలిఉంది. వరండా పైకప్పులో అందమైన శిల్పాలు మాకు కనువిందుచేసాయి. అక్కడి కుడ్యచిత్రాలు అద్భుతంగా ఉన్నాయి. ఈమండపంలోని ఎడమవైపు గోడపై బుద్ధుని జీవితగాధల సంఘటనలను వివిధ పలకాలపై రకరకాలుగా చిత్రించారు. గది తలుపునకు పైన గల ఫలకంపై బోధిసత్వుడు స్వర్గంలో కన్పిస్తాడు. భూమిపైన జన్మ,పునర్జన్మల చక్రాన్ని దాటిన బోధిసత్వుడు ఆఖరుసారిగా జన్మనెత్తి తన అంతిమ గమ్యస్థానం చేరుకున్నట్లుగా చిత్రీకరించారు.



దిగువ ఎడమవైపున గల  ఫలకంపై మాయాదేవికి వచ్చిన చిత్రమైన కల ను కళాత్మకంగా చిత్రించారు. బుద్ధుని జననానికి ముందు ఆమె తన పడకగ దిలో నిద్రిస్తున్న సమయంలో ఆరు దంతాలతో ఉన్న ఒక తెల్లని ఏనుగు ఆమె శరీరంలోకి ప్రవేశించినట్లు కల వస్తుంది. ఆమె అదేవిషయాన్ని తన భర్త శుద్ధోధనునితో చెబుతున్న సన్నివేశాన్ని పైవైపున ఆఖరుఫలకంపై చిత్రీకరించా రు. రాజుసభలోని పురోహితులను పిలిపించి తన భార్య మాయాదేవికి వచ్చిన స్వప్నం చెప్పి దాని పర్యవసానం ఏమిటని అడుగుతున్న సన్నివేశాన్ని కుడివైపు న గల ఫలకంపై చిత్రంగా ఆనాటి చిత్రకారులు రూపొందించారు.



ఈ గుహలో ముందరి వరండా కుడి గోడపై చాలా వరకూ శిధిలమై ఉన్న ఒక చిత్రం ఉంది. ఇదికూడా అజంతాకు సంబంధించిన అత్యుత్తమ కళాఖం డంగా గుర్తింపు పొందింది. ఇందులో విశేషం ఏమంటే ఖడ్గాన్ని ధరించిన ఒక రాజు ఒక స్త్రీని శిక్షిస్తున్నట్లుగా చిత్రించారు. ఆ స్త్రీ వోకరిల్లి దయాభిక్ష కలిగించాలని వేడుకుంటూ ఉంటుంది. ఈ చిత్రంలో ఆమె ముఖం దు:ఖ పూరితమై ఉంటుంది. సన్నని నాజూకైన శరీరంతో ఉన్న ఆమె అపురూప లావణ్యంతో చిత్రంలో కన్పిస్తోంది. ఈ చిత్రం విస్తారంగా ఉంటుంది. ఇందులో అనేక రకాల వస్త్రాలు నలిపోయి నేలమీద కుప్పలుగా కన్పిస్తాయి. ఈ చిత్ర ంలో అభివర్ణితమైన హావభావాలు రమణీయకంగా తీర్చిదిద్దారు. ముందుగదికి

రెండు పక్కలా ఉన్న ఆలయాల్లో చక్కని కుడ్య చిత్రాలున్నాయి. కుడి పక్కన గల చిత్రాల్లో స్త్రీ మూర్తుల చిత్రణ అద్భుతంగా ఉంది.



ముందుగది,ఆలయంలో గల చిత్రాలు నిరుపమానమైనవి. పైకప్పున ఉన్న చిత్రాల్లో ఒకదానివెనుక మరొకటి మొత్తం ఇరవైమూడు హంసలు వరుసగా బారులు తీరి వెళ్తున్నట్లు అపూర్వంగా చిత్రించారు. మూడో నంబర్ గుహలో పెద్ద విశేషాలు ఏమీ లేవని గైడ్ చెప్పడంతో అంతా నాలుగో గుహవైపు నడిచాము. అజంతాలోని నాలుగో గుహ అతిపెద్ద విహారంగా ఉంది. విస్తృతం గా అలంకృతమైన ముఖ్య ద్వారం గుండా ఈ గుహలోకి వెళ్లాము. ఇది దాట గానే ఇరవై ఎనిమిది స్తంభాలు గలిగిన ఒక పెద్ద మండపం వచ్చింది. తలుపునకు కుడివైపున అష్టభయాలనుంచి విముక్తికై ప్రార్థిస్తున్న భక్తుల మధ్య

బోధిసత్వుడు కన్పించారు. ఈ మండపం మూలల్లో,తలుపుల మధ్యలో ఎన్నో వివరణాత్మకమైన శిల్పాలు కనువిందు చేస్తున్నాయి.



ఈ శిల్పాలలో మదపుటేనుగ బారి నుంచీ పరుగులు తీస్తున్న స్త్రీ, పురుషులు, చెట్టునిఆనుకుని ఉన్న ఒక యువతి ఉడుతతో ఆడుకోవడం, ఒక మహిళ మాయలో చిక్కుకుని జాలిగా చూస్తున్న పురుషుడు వంటి వాటిని సునిశితమైన పనితనంతో బాగా మలిచారు. అక్కడినుంచి ఐదో గుహలోకి కొన్నిప మెట్లు ఎక్కాక ముఖద్వారానికి ఇరువైపులా సాలభంజికలవిగ్రహాలున్నాయి.ఆరోగుహ రెండు అంతస్తులున్న ఏకైక విహారంగా కన్పించింది. రకరకాల భంగిమల్లో ఉన్న బుద్ధుని విగ్రహాలు ఆకట్టుకున్నాయి. ఏడెనిమిది నెంబర్ల గుహల్లో పెద్ద ప్రత్యేకత ఏమీ లేదు.



అంతా తొమ్మిదో నంబరు గుహవైపు కదిలాము. ఇది ఒక  చైత్య మంటపం. ఇది క్రీస్తు పూర్వం ఒకటో శతాబ్ధం నాటిదని గైడ్ చెప్పాడు. ప్రజల దైనందిన జీవితాన్ని  ప్రతిబింబించే కుద్యచిత్రాలను చూసాం. పశువుల కాపరులు తమ ఆలమందలను కాసుకుంటున్న చిత్రం, నిరాడంబరంగా ఉన్న బుద్ధుని విగ్రహాలు, స్తంభాలపైనా, వెనుక గోడలపైనా, గవాక్షాలపైనా ఉన్న చిత్రాలు ఆనాటి హీనయాన బౌద్ధానికి, ఆతర్వాత వచ్చినవైవిధ్యతకు నిదర్శనాలుగాకన్పించాయి.

పదో గుహ  కూడా తొమ్మిదో గుహలాగే ఉండే ప్రార్థనాలయం. అయితే ఇది దానికన్నా పెద్దది. దీని ముందు భాగంలో రాసిన వివరణలను బట్టి ఇది క్రీస్తుపూర్వం రెండో శతాబ్దానికి చెందినదని తెలుస్తోంది. ఇది చైత్యాలన్నింటిలో ప్రాచీనమైనదిగా కన్పించింది.



ప్రాచీన బారత చిత్రకళకు ప్రతిబింబాలుగా ఉన్న ఈచిత్రాలు చాలా ఆసక్తి కరంగా ఉన్నాయి. ఇందులో మూడో స్తంభానికి ఎదురుగా ఉన్న గోడపైన ఒక రాజ వంశస్థుడు సైనిక, నృత్య గాయక బృందంతో దర్శనమిస్తాడు. ఆనాటి వారి దుస్తులు, నగలు, కేశాలంకరణ వంటివి విభిన్నంగా కన్పిస్తూ ఆసక్తిని పెంచాయి. పదకొండో గుహలో కొన్ని చిత్రాలు మాత్రమే ఉన్నాయి.పన్నెండో గుహలో హీనయాన బౌద్ధ విహారం ఉంది. ఈ గుహకు మూడు పక్కలా బౌద్ధ సన్యాసుల నివాస స్థానాలు వాటిలో రాతి పడకలనూ చూసాము.తర్వాత రెండు గుహాలు అంత ప్రాముఖ్యత లేనివని తెలిసి పదహారో గుహలోకి వెళ్లాము. కొంచెం దిగువకు రాతి మెట్లు గుండా నడిచివెళ్లాము.



ఈ గుహ ముఖ్య ద్వారానికి ఇరువైపులా చెక్కబడిన ఏనుగుల విగ్రహాలున్నాయి . ఇక్కడి నుంచి నదిని చేరడానికి మెట్ల వరుస దిగువన ఉంది కానీ అదిశిథిల మైపోయి ఉంది. ఈ గుహాలయాలన్నింటిలోనూ ఇది అత్యంత రమణీయంగా ఉంది. వాస్తుశిల్ప కళావైభవం అపురూపంగా అలరారుతోంది.

క్రీసుశకం ఆరో శతాబ్దంలో దీనిని నిర్మించినట్లు ఈ గుహాముందున్న ఫలకం తెలియజేస్తోంది. ఇందులో కూడా అపురూపమైన శిల్పాలు, చిత్రాలు బుద్ధుని జీవితగాథలను మాకు పరిచయం చేసాయి. ఈ గుహలో అతి సుంద రమైన చిత్రం ఒకటుంది. దానిని అంతర్జాతీయ చిత్రకళావిమర్శకులు "ది డైం ఇంగ్ ప్రిన్సెస్ " (మరణిస్తున్న రాకుమారి)గా వ్యవహరిస్తున్నారు.



విషాదానికి సజీవరూపంగా ఈ చిత్రాన్ని చిత్రించారు. పదిహేడో గుహ కూడా పదహారో గుహలాగే కన్పించింది. అయితే దీనికి అదనంగా ఒక ముందర గది కూడా ఉండడం ఓ ప్రత్యేకత. నగిషీలతో ఉన్న ఫలకాలతో ముఖద్వారాన్ని అలంకరించారు. లోపల ఉన్న చిత్రాలు అత్యద్భుతమైనవి. కాలపరీక్షకు నిలిచినవి చాలా ఉన్నాయి. వీటిలో బుద్ధుని జీవిత విశేషాలను, జాతక కథలలోని సన్నివేశాలను వివరించేవే అత్యధికంగా ఉన్నాయి. సింహళరాజు విజయాన్ని చిత్రించే చిత్రాలు కూడా ఎంతో రమణీయంగా కన్పించాయి. పద్దెనిమిదో గుహలో ఏమీ లేదని తెలిసాక పంతొమ్మిదో గుహలోకి వెళ్లాము. ఇది ఒక చైత్య

మంటపం. ఇందులో చిత్రాల కన్నా బుద్ధుని శిల్పాలే వివిధ భంగిమల్లో అత్యధి కంగా ఉన్నాయి.



ఇరవయ్యో గుహ కూడా వాస్తుశిల్పకళకు చక్కని నిదర్శనంలా కన్పించింది. ఆ తర్వాత ఇరవైఒకటి నుంచీ ఇరవై ఐదో గుహవరకూ అంత ఆసక్తికరంగా కన్పించలేదు. కారణం ఇవి అసంపూర్తిగా ఉండడమే. ఇరవయ్యారో గుహ అజంతాలో చివరిదీ, అత్యంత ఉత్కృష్టమైనదీ. ఇందులో శిల్పాల సంఖ్య చాలా ఎక్కువగా కన్పించింది.



ఈ గుహలోనే బుద్ధుని మహాపరినిర్యాణంను అత్యంత ప్రతిభావంతంగా శిల్పాలు గా మలిచారు. అజంతాలో కొండరాళ్లపై ఎలా శిల్పాలను తొలిచారో సూచించడానికి తగిన ఔట్‌లైన్ శిల్పరచన కూడా ఇందులో ఒక చోట ఆనాటి శిల్పులు చూపించారు. రాతి పై భాగంపై గీతలు గీసి వాటి అంచనావేరకు శిల్పాలను చెక్కినట్లు స్పష్టమైంది మాకు. అజంతా గుహల సందర్శనలో అవసరమై చోటల్లా ఫోటోలు, వీడియోలుదిగాం.



అక్కడే గుహల ప్రారంభంలో ఉన్న పురావస్తుశాఖ విక్రయకేంద్రంలో లియాఖత్ ఆలీ, నేనూ కొన్ని విలువైన పుస్తకాలు కొనుగోలు చేసాము.అక్కడి నుంచి దిగువకు వచ్చాక ధమ్మమిత్రులలో చాలామందిమి బుద్ధుని బొమ్మలను కొనుగోలు చేసాం. ఇంతలో బస్సు రాగా తిరుగు ప్రయాణమయ్యాం. అజంతాలో ఎవరికి వారి అనుభూతులను కృష్ణార్జునబోధితో సహా, మిత్రులమంతా బస్సులో ఏర్పాటు చేసిన మైక్ ద్వారా ముచ్చటించుకున్నాం. వేము బసచేసినచోటుకు బస్సు తిరిగి చేరుకునేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది. రాత్రి బోజనాన్ని ముగించి ఆజంతా తలపులతో తర్వాత రోజు ఎల్లోరా గుహలు చూడాలని నిద్రకు ఉపక్రమించాము.

---------

# శిల్ప సిరికి శ్రీనిధి ఎల్లోరా

మా ధమ్మ యాత్రలో ముందుగా ఎల్లోరా గుహలను సందర్శించాలని ప్రణాళిక వేసుకున్నా అనివార్యకారణాలవలన రెండో రోజు (మార్చి 2వ తేదీ)కి గానీ అది కుదర లేదు. అజంతా చిత్ర, శిల్ప కళా సౌందర్యాన్ని కనులారా వీక్షించి మైమరిచిన మాకు ఎల్లోరా శిల్పాలను ఎప్పటికి చూస్తామా అన్న ఉత్సుకత తీరే సమయం వచ్చేసింది. మేము బసచేసిన చోటునుంచే బస్సులో ఎల్లోరాకు వెళ్లడానికి వీలుపడదని ముందుగా గుర్తించిన నిర్వాహకులు పామర్తి రవి నాలుగు ఆటోలను రప్పించారు. వాటిలోనే బృందాలుగా మేమంతా బయలుదేరాం.




ఔరంగాబాద్‌కు పద్దెనిమిది మైళ్ల దూరంలో ఉన్న ఈ ఎల్లోరా గుహలను సందర్శించాలంటే దౌలతాబాద్ కోట పక్కనుంచే వెళ్లాలి. ఆటోల్లోవెళ్తూ మహమ్మద్‌బీన్ తుగ్లక్ తన పాలనలో ఢిల్లీని రాజధానిగా కాదని దౌలతాబాద్‌ని కొత్త రాజధానిగా ఏర్పాటు చేయడం , అక్కడ ప్రతికూలపరిస్థితుల కారణంగా మళ్లీరాజధానిని ఢిల్లీకిమార్చడం వంటి విశేషా

లను గుర్తుచేసుకున్నాం. మేము కూర్చొన్న ఆటోలు ఎల్లోరాలోని పదహారో నెంబర్ గుహ కు అభిముఖంగా ఉన్న టాక్సీ స్టాండులో ఆగాయి. అయితే ఎల్లోరా గుహల సందర్శన పదహారో గుహ నుంచి మొదలు పెట్టడం కన్నా అక్కడనుంచి దక్షిణదిశగా వెళ్లి ఒకటో నెంబర్ గుహనుంచి ప్రారంభించడం మంచిదని ఎక్కడో చదివినందు వల్ల అటువైపు అడుగులు వేసాము.



అంతకు ముందురోజు మేము చూసిన అజంతా గుహలన్నీ బౌద్ధమతంలో వివిధ దశల ను ప్రతిబింబిస్తే అందుకు భిన్నంగా ఎల్లోరా గుహలు బౌద్ధ, జైన, వైదిక మతాల శిల్ప కళకు సంకేతాలుగా నిలుస్తున్నాయి. మొత్తం 34గుహలు గల ఎల్లోరాలో 1నుంచి 12వ గుహవరకూ బౌద్ధం,13నుంచి 29వ గుహవరకూ వైదిక మతం, 30 నుంచి 34వరకూ

జైన గుహలున్నాయి. మా ఆటోలు నిల్పిన స్థలానికి సమీపంలో ఉన్న పదహారో నెంబర్ గుహ వైదిక మతానికి చెందినది. ఈ గుహలన్నింటిలో బౌద్ధ గుహలు అన్నింటికన్నా ప్రాచీనమైనవని వీటిని క్రీస్తు శకం **500** నుంచి **700** మధ్య కాలంలో చెక్కి ఉంటారని అక్కడనున్న భారత పురాతత్వ సర్వేక్షణ ఏర్పాటుచేసిన ఫలకాలుతెలియజేస్తున్నాయి. ఈ గుహల్లో **5,10, 15, 16, 21, 32** నంబర్లు గలవి అత్యంత ప్రముఖమైవని తోటి సందర్శకులు చెప్పారు.



ధమ్మ మిత్రులమంతా ఒకటో నెంబర్ గుహలోకి అడుగుపెట్టాము. ఇది ఎల్లోరాలోని అత్యంత పురాతనమైన నిర్మాణం. ఇది సాధారణమైన ఎనిమిది గదుల విహారం. ఇం దులో విశేషాలు మాకు ఏమీ కన్పించకపోయినా విశాలమైన ప్రాంగణం లోపల ఉంది. ఈ గుహంతా కలియతిరిగి రెండో నంబర్ గుహలోకి వెళ్లాము. ఇది ఒక పెద్ద చైత్య మందిరం. దీని పైకప్పునకు కుషన్ స్తంభాగ్రాలతో ఉన్న అతి పెద్దవైన పన్నెండు స్తంభా లున్నాయి. సింహాసనంపై కూర్చొన్న అతి పెద్ద బుద్ధవిగ్రహం ఉంది. ఈ గుహలోనే పద్మాసనంలో ఉన్న బుద్ధుని విగ్రహాలు కూడా ఉన్నాయి. వీటితో పాటు అనేక మంది బోధిసత్వుల విగ్రహాలను కూడా ఆనాటి శిల్పులు రమణీయంగా మలిచారు.



మూడో నెంబర్ గుహ దీనిని ఆనుకునే ఉంది. ధమ్మ మిత్రులమంతా ఆ గుహలోకి నడిచాము. ఇది దాదాపుగా అంతకు ముందు సందర్శించిన రెండో నెంబరు గుహనే పోలి ఉంది. ఈ గుహ ప్రాంగణం చివరిలో ప్రార్థనామందిరం ఉంది. ఇక్కడ పద్మాసనం లో ఆశీనుడైన బుద్ధుని పక్కనే పాముతలలు కలిగిన నాగశిల్పాలు కన్పించాయి మాకు.

నాలుగో నెంబరు గుహలో చూడాల్సిన విశేషాలు ఏమీలేవని తెలిసి ఐదోనెంబరు గుహ వైపు కదిలాము. ఇప్పటి వరకూ మేము చూసిన ఎల్లోరా గుహల్లో ఇది బాగా పెద్దదిగా మాకు కన్పించింది. ఈ గుహ **117×56** అడుగుల కొలతలు గల విహారం అని గుహ ముందు ఏర్పాటు చేసిన సూచిక ఫలకంలో భారత పురాతత్వసర్వేక్షణ విభాగం పేర్కొన్న విషయాన్ని గమనించాము. ఇది విహారం మాత్రమే కాకుండా రెండు వైపులా ప్రత్యేకం గా గూడులు వంటి ప్రదేశాలున్నాయి. ఈ మందిరంలో ఇరవైనాలుగు స్తంభాలున్నాయి. లోపలి భాగాన్ని చూసిన మాకు ఇది అతిధి గృహంగానైనా లేకపోతే శిష్యులకు బోధన లు చేసే మందిరంగా ఉపయోగించి ఉంటారని అన్పించింది. ఇక్కడున్న ప్రార్ధనామందిర ంలో కూడా  పెద్దదైన బుద్ధుని విగ్రహం మా అందర్నీ ఆకట్టుకుంది.



ఆరో నంబరు గుహలో చాలా ప్రత్యేకతలు కన్పించాయి. ఇది బౌద్ధ గుహ అయినప్పటికీ వీణాపాణి అయిన సరస్వతి విగ్రహం కూడా ఇక్కడ ఉండడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ గుహలో వివిధ బౌద్ధ జాతకకథలకు సంబంధించిన శిల్పాలు

అందరికీ  కనువిందు చేస్తున్నాయి. ఏడు నుంచి తొమ్మిదో నంబరు వరకూ ఉన్న గుహ ల్లో పెద్ద ప్రత్యేకతలు ఏమీలేకపోవడంతో పదో నంబరు గుహలోపలకి వెళ్లాము. ఇది ఎ ల్లోరా గుహల్లో సక్రమంగా తీర్చి దిద్దిన బౌద్ధచైత్యమందిరంగా మేము గుర్తించాము. ఈ గుహ ముందు భాగాన్ని ఎక్కువగా నగిషీలు చెక్కి అలంకరించారు. ఆధునాతనమైన తా పీపనితో దానిని రూపొందించారా అన్నట్లు ముందు భాగం కన్పించింది. ప్రార్థనామంది రం లోపలి భాగాన పైన చుట్టూ గ్యాలరీలుగల ఆర్చ్‌లు ఉన్నాయి. పై కప్పునకు కూడా వివిధ అలంకృతులతో నగిషీలు చెక్కారు. ఆనాటి కర్రపనితనాన్నే శిల్పాకృతుల్లోకి తీసుకొచ్చినట్లు కన్పిస్తోంది. స్తంభాలపైన మానవాకృతులను చెక్కారు. గుహాలయం వైదిక మత దేవతల శిల్పాచార్యుడైన విశ్వకర్మకు అంకితం చేసినట్లు ఉంది. విశ్వకర్మకు బౌద్ధంతో ఎలాంటి సంబంధం లేకపోయినా ఇది భిన్నభావాల మిశ్రమ సిద్ధాంతమైన మహాయానానికి ప్రతీకగా కన్పిస్తోంది. ఇక్కడి నుంచి మెట్లు ఎక్కి ధమ్మమిత్రులమంతా పెద్దస్తంభాల ఆవరణలోకి వెళ్లాము. ఊచల పిట్టగోడతో నిర్మించిన దాబా  ఇక్కడుంది. సందర్శకుల సౌలభ్యానికి ఈ పిట్టగోడ నిర్మించారని తెలుస్తోంది.



ఆ తర్వాత పదకొండో నంబరు గుహలోకి మేమంతా వెళ్లాము. ఇది మూడంతస్థుల్లో నిర్మించిన ఒక కట్టడం. ప్రతి అంతస్థులోనూ స్తంభాల ఆధారంగా వసారాలు ఏర్పాటు చేసారు. వివిధ రకాలలో బుద్ధుని శిల్పాలతో గేలరీలను నిర్మించారు . తొలి ఎల్లోరా శిల్పకళకి ఇది ప్రాతినిధ్యం వహించేదిగా కన్పించింది మాకు. పన్నెండో నంబరు గుహ మరింత పెద్దది. డిజైన్ విషయంలో అంతకు ముందు చూసిన పదకొండో నంబరు గుహను పోలి ఉన్నప్పటికీ దానికన్నా ఇది పెద్దది. ఇది కూడా మూడు అంతస్థుల్లో నిర్మితమై ఉంది.



దీనిని ఇక్కడ 'తీన్‌థల్'గా పిలుస్తారని గైడ్ చెప్పారు. దీనికి ఎదురుగా పెద్ద బహిరంగ ఆవరణ ఉంది. రాతిని చెక్కి రూపొందించిన పెద్దదైన ద్వారంగుండా ఈ గుహలోపలకు

వెళ్లాము. ఈ ద్వారం బహుశా యాభై అడుగుల ఎత్తు ఉంటుందని అంచనావేసాము. ఈ గుహలో కూడా ప్రతీ ఆంతస్థులో స్తంభాల ఆధారంగా వసారాలు ఏర్పాటు చేసారు. గ్రౌండ్ ఫ్లోరు, మొదటి అంతస్థులకు మూడు వరుసల్లో స్తంభాలున్నాయి. ఇవి దీనిని మూడు భాగాలుగా విభజిస్తున్నాయి. రెండో ఆంతస్థులో ఉన్న పెద్ద మందిరం పొడవైన ది. ఇది కూడా నలభై చదరపు స్తంభాల ద్వారా ఐదు వరండా మార్గాలుగా విభజితమై ఉంది. ప్రతి అంతస్థులోనూ గేలరీలున్నాయి. ఆలయంలోపల అతి పెద్దదైన బుద్ధుని విగ్రహం ఉంది. ఈ విగ్రహంలో బుద్ధుని రెండు చేతులూ జోడించి ఉంటాయి. ఇలాంటి విగ్రహం ఇంకెక్కడా మనకు కన్పించదు. ఆయనముఖం తీవ్రధ్యానంలో ఉన్నట్లుగా శి ల్పులు అత్యంత ప్రతిభావంతాగా మలిచారు.



బౌద్ధమత గుహల సందర్శన పూర్తికావడంతో పక్కనే ఉన్న వైదిక మత గుహలను చూడడానికి బయలుదేరాం. ఇవి క్రీస్తుశకం **7-9** శతాబ్దాల మధ్యకాలంలో చెక్కారని అక్కడున్న సూచికలు తెలియజేస్తున్నాయి. అంతవరకూ మేము చూసిన గుహల్లో ఉన్న చైత్యమందిరాలు, విహారాలకూ ఈగుహలకూ ఏమాత్రం పోలికేలేదు. బౌద్ధకళలాగే ఈ చెక్కడాలు మత సంబంధమైనవే అయినప్పటికీ వాటి వ్యక్తీకరణ మరో రూపంలో మాకు కన్పించింది. ఎల్లోరాలోని **14**వ గుహలోకిధమ్మమిత్రులమంతా అడుగుపెట్టాము. ఇది వైదిక మతానికి పరిచయంలా రూపొందించారు.



ఈ గుహలో ఎడమవైపున మొదటి ఫలకంలో దుర్గ విగ్రహాన్ని చెక్కారు. మూడవ ఫలకంపై విష్ణువు విగ్రహం ఉంది. ఈ గుహాలయంలో లక్ష్మి విగ్రహం కూడా మాకు కన్పించింది. కుడివైపు గోడమీద శివుడుతోపాటు అనేక రకాల దేవుళ్ల విగ్రహాలను

చెక్కారు. ఈ దేవుళ్లలో శివుని భార్య పార్వతి విగ్రహాన్ని కూడా రూపొందించారు. దీని తర్వాత పదిహేనో గుహను చేరుకోవడానికి చాలా మెట్లు ఎక్కాల్సివచ్చింది. పైకి వెళ్లాక అందంగా చెక్కిన గేటు కన్పించింది.



ఈ గుహకు రెండు అంతస్థులున్నాయి. మంటపంలో అనేక చిన్నచిన్న ఆలయాలు, పూజారులు నివసించే గదులున్నాయి. మొదటి ప్రాంగణంలో విశాలమైన మందిరం ఉంది. అయితే ఇందులో చూడడానికి ఏమీ లేదు. ఎగువ మందిరంలో రెండు గోడల లో గల సొరంగంలో ఎంతో చక్కగా మలచిన శిల్పాలు కన్పించాయి. ఈ శిల్పాలను సందర్శకులు పోల్చుకోవడానికి వీలుగా పురావస్తు శాఖ వాటికి నేమ్‌ప్లేట్లను ఏర్పాటు చేసింది. ఈ విగ్రహాల్లో ప్రధానంగా మాకు కన్పించినవి వివిధ రూపాల్లోని శివుని

విగ్రహాలు. అష్టబాహువులతో యోధుని రూపంలో రాక్షసులతో యుద్ధం చేస్తున్న శివుడు , శివతాండవ దృశ్యం, పార్వతితో పాచికలు ఆడుతున్న శివుడు, లింగోద్భవుడైన శివుడు ....ఇలా రకరకాల రూపాల్లో శివుని విగ్రహాలు అనేకం మాకు కన్పించాయి. ఈ గుహా లయంలో ఒక శివలింగం దానికి ఎదురుగా నంది ఉన్నాయి.



ఎల్లోరా గుహాలయాల్లో అత్యంత ఉత్కృష్టమైనది పదహారో నెంబరు గుహ. దీనిని కైలాసంగా అభివర్ణిస్తుంటారు. ప్రపంచంలోనే అద్భుతమైన ఏకశిలా నిర్మాణంగా ఇది గుర్తింపు పొందింది. అటువంటి గుహలో ధమ్మమిత్రులమంతా అడుగుపెట్టాం.లోపలకు వెళ్లగానే మానవ మహామేధస్సుకు, కళాసృజనకూ నిలువెత్తునిదర్శనంలా అది మాకు కన్పించింది. ఒక కొండలోని సుమారు 30లక్షల ఘనపుటడుగుల రాతిని పూర్తిగా చెక్కి ఈ కైలాస శిల్పాలను రూపొందించారు. అనేక వందలమంది భవన నిర్మాణ నిపుణులు, శిల్పులు కలిసి ఈ మహాద్భుతాన్ని సృష్టించారని చూడగానే మాకు స్పష్టమైంది. ఈ గుహాలయ నిర్మాణపనిని మొదట కొండ శిఖరాగ్రం నుంచి ప్రారంభించి ఉంటారని

మేము భావించాము. ఒక దీర్ఘచతురస్రాకారపు అగడ్తను రాతి లోతుల్లోకి తవ్వి ఉంటార ని తెలుస్తోంది. సుమారు ముప్పైలక్షల ఘనపుటడుగుల రాతిని చెక్కి **107** అడుగుల లోతు, **154** అడుగుల వెడల్పు **276** అడుగుల వైశాల్యంతో ముందుగాతవ్వి, ఆతర్వాత మధ్యలో మిగిలిన రాతిని దశాబ్దాలపాటు చెక్కి బృహత్ శివాలయంగా మలిచారు. ఈగోడలపైనా, లోపలా ఎన్నో రకాలుగా అపారమైన నగిషీలను చెక్కి వాటికి అద్భుత నిర్మాణాన్ని జోడించారు.



ఇందులో ఒక విశాలమైన ప్రాంగణం, అందులో మూడు భవంతుల్లాంటి ఆలయాలు వాటిని ఒకదానికొకటి సంధానించే విధంగా ఉపరితల వంతెనను కూడా ఏర్పాటు చేసా రు. అంతేకాదు వీటి పక్కభాగాలకు సజీవ పరిమాణంలో ఉన్న ఏనుగుల విగ్రహాలను

చెక్కారు. ఈ ఏనుగుల విగ్రహాల ప్రత్యేకత ఏమిటంటే ఏనుగులే ఆలయభారాన్ని మోస్తు న్నట్లుగా ఉన్న భంగిమలతో శిల్పులు తీర్చిదిద్దారు. ఈ గుహాలయం పైకప్పు మూడు విభాగాలు గల పొరలతో సూది వంటి శిఖరాకృతిలో గోపురం ముందుకు పొడుచుకుని ఉండి మొనదేలినట్లు కన్పిస్తోంది. పైన అర్ధగోళాకృతిలో నిర్మాణం జరిపారు. బయటి ప్రాంగణం చివరన కుడివైపు మూలనుంచి ఈ ప్రాసాదపు సుందర ముఖాకృతి విలక్షణ మైన రూపంలో మాకు దర్శనమిచ్చింది. ఈ గుహాలయం ఉత్తర ప్రాంగణంలో ఒక పెద్ద ఏనుగు శిల్పం మాకు కన్పించింది. దీనికి తొండం లేదు. పక్కనే అతి పెద్దదైన విజయ స్తంభం కూడా ఉంది.



ఇంకా పైకి వెళ్లిన మాకు పన్నెండు ఫలకాలు గల ఒక గ్యాలరీ కన్పించింది. ఇందులో శివపురాణగాథల కల్పనలను శిల్పాలుగా మలిచారు. ఈ గ్యాలరీకి తూర్పువైపున గల

ఫలకాల్లో శివుడు రకరకాల భంగిమల్లో  ఉన్నట్లు విగ్రహాలను ఏర్పాటు చేసారు. ఈ గోడకు దక్షిణంవైపునఉన్న గ్యాలరీ ఆనుకొని ఉంది. ఇక్కడ విష్ణువు విగ్రహాలు విభిన్న రూపాల్లో మాకు కన్పించాయి. గ్యాలరీకి దగ్గరలోనే ఒక అపూర్వమైన శిల్పకళాఖండాన్ని చూసాము. అది "కైలాసాన్ని వణికిస్తున్న రావణుడు" అని ఇంగ్లీషులో అక్కడ రాసి ఉంది.



ఈ అలయంలో అన్ని వైపులా రకర కాల శిల్పాలు భారతీయ శిల్పుల కళా ప్రతిభకు అద్దం పడుతున్నాయి.  మొదటి అంతస్థులో ముఖ్యమైన కారిడార్‌కి అనుకుని అందంగా అలంకృతమైన వరండాలున్నాయి.  మధ్య ద్వారం నుంచి వెళ్తే ఒక పెద్ద శివలింగం గల గర్భగుడి వచ్చింది. ఈ అలయానికి ఎదురుగా యాభై అడుగులు ఎత్తుకలిగి ముఖ్య కట్టడానికి సమాంతరంగా ఉన్న మందిరం ఒకటి ఉంది. ఇరవై చదరపు అడుగుల వైశాల్యమున్న ఈ మందిరంలో నంది విగ్రహాన్ని  చూసాము. ఈ నంది విగ్రహానికి ఇరు వైపులా ఒక రాయి, ఒక స్తంభం ఉన్నాయి. ఈ ధ్వజస్తంభం సుమారు యాభై అడుగుల కు పైగా పొడవుంటుందని అనుకున్నాము. దీనిమీద సూక్ష్మశైలిలో ఎన్నో శిల్పాలను చెక్కి

ఉన్నారు. మతాభిప్రాయాలను పక్కనపెడితే ఈ గుహాలయం మాత్రం భారతీయ శిల్పకళకు ప్రపంచఖ్యాతిని తీసుకొచ్చిందనడంలో ఎలాంటి సందేహం లేదని అన్పించింది.



పదహారో గుహలో కనువిందుచేసిన శిల్పసౌందర్యం మా మనసుల్ని ఇంకా మైమరపిస్తుండగానే పదిహేడో గుహలోకి అడుగు పెట్టాము. ఈగుహలో చాలా పెద్దవైన స్తంభాలున్నాయి. దీని గర్భ గృహంలో ఒక శివలింగం, బ్రహ్మ, విష్ణు, గణపతి, మహిషాసుర మర్ధని విగ్రహాలున్నాయి. ఆతర్వాత పద్దెనిమిదో గుహ సాధారణంగా కన్పించింది. ఇందులో నాలుగు స్తంభాలతో పాటు గర్భగుడిలో ఒక శివలింగం మాత్రమే ఉంది. పంతొమ్మిదో గుహ కూడా ఇంచుమించు ఇలానే మాకు కన్పించింది. అక్కడి నుంచి కొన్ని మెట్లు ఎక్కి ఇరవయ్యో గుహలోకి అడుగుపెట్టాము.

పెద్ద పెద్ద ద్వార పాలకుల, పాలికల విగ్రహాలు కన్పించాయి. గర్భగుహ లోపల ఎంతో అందంగా మలిచిన శివలింగం, గణపతి, మహిషాసురమర్ధని విగ్రహాలను

చూసాము. ఇక ఇరవయ్యొకటో గుహ ముఖభాగం ఆకర్షణీయంగా ఉంది. దీనిపక్కనే గంగ, యమునల విగ్రహాలున్నాయి. స్తంభాలకు పై భాగంలో స్త్రీమూర్తుల విగ్రహాలు, వాటిపైన ఆకుల చిత్రాలు, పాదాలకింద పద్మదళాలు చెక్కారు. గదిలోపలున్న ఫలకాల పై శివపార్వతుల కళ్యాణ భంగిమల్లో విగ్రహాలు మలిచారు.



22నుంచి 24వ నెంబరు గుహవరకూ అంతగా చూడాల్సినవి ఏవీ లేవని తెలిసి మేము 25వ నెంబరు గుహలోకి వెళ్లాము. ఇది కూడా ఎల్లోరాలోని అతి పెద్ద గుహల్లో ఒకటి. దీని అంతర్భాగంలో రథంతో నిలబడి ఉన్న సూర్యుని పెద్దవిగ్రహం ఉంది. ఏడు గుర్రాలు, వాటిని నడుపుతున్న అరుణ్, ఉష, ప్రత్యూషలు ధనస్సూ భాణాలూ ధరించి ఉన్నట్లు చెక్కారు. ఇరవయ్యారో గుహ అంతకు ముందు చూసిన ఇరవయ్యొకటో గుహనే

పోలి ఉంది. ఇరవయ్యేడో గుహలోకి వెళ్లాము. అందులో హలాన్ని ధరించిన బలరాము డు, కృష్ణుడు, శేషశాయిగా ఉన్నవిష్ణువు, వరాహావతారం, మహిషాసురమర్ధని తదితర విగ్రహాలను చూసాము. ఇరవైయెనిమిదో గుహ ఖాళీగా ఉంది. ఇరవై తొమ్మిదో గుహ పెద్దదే. ఇందులో క్రాస్ ఆకారంలో గదుల వరుసలున్నాయి. ఈ గుహకు మూడు వేర్వే రు ముఖ్యద్వారాలుండడం ఓ ప్రత్యేకత. వెడల్పాటి స్తంభాలతో మెట్లకు ఇరువైపులా సింహాలు కాపలా కాస్తున్నట్లు చెక్కారు. ఇందులో ఉన్న అష్టభుజ శంకరుడు, విలయ తాండవం చేస్తున్న నటరాజు, నదీదేవత ̆యమున తదితర విగ్రహాలన్నీ పెద్ద పరిమాణం లో కన్పించాయి.



వైదిక మత గుహల తర్వాత జైన మతానికి సంబంధించిన గుహలను చూడడానికి ఉత్తర దిశగా ధమ్మమిత్రులమంతా నడిచాము. 30 నుంచి 34వ నంబరు వరకూ ఉన్న ఈ గుహల్లో ముఖ్యమైనవి 32,34 నెంబర్ల గుహలే అని అక్కడున్నవారు చెప్పారు. 30వ నెంబరు గుహను 'చోటా కైలాస్' అని వ్యవహరిస్తుంటారు. ఇది 16వ గుహను కొంత వరకూ పోలిఉంటుంది. దీని స్తంభాలు, పైకప్పులనూ పద్మాకారపు నగిషీలతో చెక్కారు. వర్ధమాన మహావీరుని విగ్రహం, అయన చుట్టూ చాలా మంది జైన తీర్థంకరుల విగ్రహాలున్నాయి. 31వ నెంబరు గుహలో కూడా మహావీరుని విగ్రహం, తీర్థంకరుల విగ్రహాలున్నాయి. 32వ గుహను 'ఇంద్రసభ' అంటారని పక్కనే ఫలకంలో రాసారు.

దీని ముఖద్వారం వద్ద సుమారు 30 అడుగుల ఎత్తైన ఏనుగు విగ్రహం ఉంది. దానికి సమీపంలోనే అందంగా అలంకరించినట్లు చెక్కిన ప్రార్థనాలయం ఒకటుంది.
దీని పైకప్పులో జైనమతానికి ప్రతీకాత్మకంగా పద్మాన్ని చెక్కారు.



దీనిపై వర్ధమాన మహావీరుని విగ్రహం ఉంది. ఎడమ గదిలో పార్శ్వనాథుని విగ్రహం ఉంది. దీనికి కాపలాగా నాగరాజు స్త్రీ, పురుష సేవకులతో ఉన్నట్లు విగ్రహాలు చెక్కారు. ఈ వరుసలోనే మహావీరుడు సింహవాహనుడిగా ఉన్నట్లు విగ్రహాన్ని మలిచారు. మరో జైన సాధువు విగ్రహం కూడా ఇక్కడుంది. ఇతడు తన చుట్టూ ఉన్న ప్రపంచానికి అతీతునిగా కఠినమైన తపో భంగిమలో ఉన్నట్లు ఈ విగ్రహాన్ని చెక్కారు. ఈ గుహకు పై అంతస్థులో ఒక వరండా , నగిషీలు చెక్కిన స్తంభాలు గలిగిన పెద్ద మందిరం ఉంది. ఇందులోని జైన విగ్రహాలు, గోడలు, స్తంభాలు ఎంతో సునిశితంగా నగిషీపనితో చెక్కిన

ట్లు విస్మయాన్ని కల్గిస్తున్నాయి. 33వ గుహ అంత ముఖ్యమైనది కాకపోవడంతో ఎల్లోరా లో చివరిదైన  34 వ నెంబరు గుహకు వెళ్లాలనుకున్నాం.



ఇంద్రసభ గుహ నుంచి పడమటి వైపు  ఆలయానికి ఎడమపక్కనున్న రాతి తలుపుతో కూడిన మార్గం గుండా వెళ్లాము. అక్కడ మరోదారిని కూడా మేము చూసాము. దీనికి ఎంతో సుందరంగా మలిచిన అర్ధచంద్రా కారపు ఆర్చి ఉంది. ఇందులో ఉన్న విగ్రహాల న్నీ సేవకబృందాలతో ఉన్న జైన తీర్థంకరులవే. గోడల్లోనూ స్తంభాలపైనా తీర్థంకరుల విగ్రహాలను విరివిగా చెక్కారు. ఈ గుహ జైన శిల్పకళకు చక్కని ప్రతీకగా కన్పించింది. ఈ గుహ నుంచి బయటకు వచ్చిన వెంటనే పామర్తి రవి అంతకు ముందు ధమ్మమిత్రు లమంతా తీసుకున్న  గ్రూప్ ఫొటో కాపీలను అందరికీ అందజేసారు.

ఎల్లోరా సందర్శనలో అక్కడక్కడా గైడ్ అవసరమైన చోట గైడ్ హిందీలో చెప్పే విషయా లను ధమ్మమిత్రులు లియాఖత్ ఆలీ తెలుగులోకి అనువదించి మాకు భాషా సమస్య రాకుండా చూసారు.



ధమ్మమిత్రుడు నరసింహారావు మా సందర్శన అంతటినీ ఛాయాచిత్రాలుగా, వీడియో దృశ్యాలుగా బంధించే పనిలోనే పూర్తిగా నిమగ్నమై ఉన్నారు. అక్కడినుంచి మళ్లీ ఆటో

ల ద్వారా  మేము నివాసం ఉండే చోటుకు చేరుకున్నాం. మధ్యాహ్న భోజనాలు ముగించి ఔరంగాబాద్‌లో మొఘల్‌చక్రవర్తి ఔరంగజేబు నిర్మించిన మినీ తాజ్‌మహల్ 'బీబీ–కా–మక్బరా' చూడడానికి బస్సులో బయలుదేరాం

## 'బీబీ-కా-మక్బరా'

ఎల్లోరా గుహల సందర్శనం పంచిన అద్భుతానుభూతిని మా ధమ్మ మిత్రులందరమూ మననం చేసుకుంటూ ఉండగానే  బస్సు ఔరంగాబాద్‌కు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్న  'బీబీ–కా–మక్బరా' కు చేరింది.



పార్కింగ్ స్థలంలో మా బస్సును నిల్పించి, ప్రవేశం టిక్కెట్లు ఐదు రూపాయల చొప్పున చెల్లించి ధమ్మయాత్ర నిర్వాహకులు పామర్తి రవి అందర్నీ సమాయత్తం చేసారు.    మా

ధమ్మయాత్ర ప్రణాళికలో 'బీబీ–కా–మక్బరా' సందర్శన అనేది ముందుగా లేకపోయినా అన్యసంప్రదాయాలపై ఉన్న కుతూహలం అటువైపు నడిపించింది. ప్రవేశద్వారం లోపలకు అందరం కదిలాం. లోపలకు అడుగుపెట్టగానే ఒక అర్ధగోళాకారపు కట్టడం కన్పించింది. దాని కింద నిల్చొని చూసిన మాకు మొత్తం కట్టడం అంతా ఎంతో అందం గా కన్పించింది. సమాధి ఉన్న ప్రధాన నిర్మాణం దగ్గరకు నడిచివెళ్లే మార్గాలకు ఇరు వైపులా నీటిరిజర్వాయర్లను ఏర్పాటు చేసారు. మొఘల్ పాదుషాల్లో ముస్లిం మతాన్ని ఎక్కువగా అభిమానించి ఆచరించిన ఔరంగజేబు తన భార్య 'రబియా–ఉద్–దురానీ' స్మృతి చిహ్నంగా దీనిని 1679లో నిర్మించాడని గైడ్ తెలియజేసాడు.



ఔరంగజేబు తండ్రైన షాజహాన్ ఆగ్రాలోనిర్మించిన తాజ్‌మహల్‌ని పోలిన నిర్మాణం ఇది కావడంతో అంతా దీనిని మినీ తాజ్‌మహల్‌గా వ్యవహరిస్తుంటారు. అయితే ఇది తాజ్ మహల్‌కి నాసిరకమైన అనుకరణ మాత్రమే. దగ్గరకు వెళ్లి చూస్తే దీని బాహ్యరూపంలో తాజ్‌మహల్‌కు సమన్వయం కన్పించదు. ఈ కట్టడానికి చలువరాతితో నిర్మించిన గుమ్మటం ఉన్నప్పటికీ గోడలు మాత్రం ప్లాస్టర్ చేసారు. దీనికి అష్టకోణాకారంలో రంధ్రాలతో ఉన్న చలువరాతి ప్రహరీగోడను నిర్మాణం చేసారు. లోపలి భాగంలోని నగిషీపని తాజ్‌మహల్‌లోని అద్భుతవాస్తు శిల్పకళతో ఏమాత్రం పోల్చదగినది కాదు. అయినప్పటికీ 'బీబీ–కా–మక్బరా' కు తనదైన దర్జా, వైభవం ఉన్నాయని గైడ్ చెప్పాడు. గైడ్ హిందీలో చెప్పిన విషయాలను ధమ్మ మిత్రులు లియాఖత్ ఆలీ తెలుగులో చక్కగా వివరించారు.



ఈ కట్టడం చుట్టూ బురుజులు తో కూడిన ఎత్తైన గోడ ఉంది. మధ్య ప్రదేశంలో చిన్న చిన్న మీనార్లున్నాయి. పై భాగం నుంచి చూస్తే ఔరంగాబాద్ పట్టణంలో కొంతభాగం కన్పిస్తోంది. అన్ని కోణాల్లో ఫొటోలు, వీడియో చిత్రీకరణలను ధమ్మ మిత్రులు నందం నరసింహారావు చేసారు.



ఇలా 'బీబీ–కా–మక్బరా' సందర్శన పూర్తి చేసుకుని, మళ్లీ మా బస్సు దగ్గరకు వచ్చాము. మాతో కలిసి వస్తున్నట్లే కన్పించిన పామర్తి రవి ముందుగానే బస్సు పార్కింగ్ స్థలానికి చేరుకుని పక్కనే అమ్ముతున్న బొప్పాయి, పైనాపిల్ పండ్ల ముక్కలను కొని మా అందరికీ అందజేసారు. బస్సులో తిరిగి మా బసకు చేరుకుని అక్కడనుంచి నేరుగా బస్సులో రాత్రి పది గంటకు జల్గాన్ చేరుకున్నాం. అక్కడే మంచి హెూటల్లో బసను ఏర్పాటు చేయించారు. నేనూ లియాఖత్ ఆలీ ఒక రూములో మిగిలిన ధమ్మమిత్రులకు వారికి అనువైన రూముల్లో అంతా సర్దుకున్నాము. తర్వాతరోజు ఉదయమే ఐదు గంటలకు మధ్యప్రదేశ్ లోని సాంచికి ట్రైన్లో వెళ్లాల్సి ఉండడంతో అంతా నిద్రకుపక్రమించాం.



మార్చి మూడో తేదీ ఉదయం నాలుగు గంటలకే అంతా సిద్ధమైపోయాం, ఆటో ల్లో జల్‌గాన్ రైల్వే స్టేషన్‌కు చేరుకున్నాం. మేము ఎక్కాల్సిన ట్రైను గంటన్నర ఆలస్యం గా రావడంతో స్టేషన్‌లోనే అల్పాహారాన్ని ముగించాం. రైల్వే అనౌన్సర్ చెప్పిన సమయా నికే ట్రైన్ రావడంతో అందు లోకి ఎక్కాం. అయితే రిజర్వేషన్ల వారీగా అందరికీ ఒకే బోగీలో బెర్తులు రాలేదు. ఆయా సీట్ల నెంబర్ల ప్రకారం ఆయా బోగీల్లో కూర్చొన్నాము. మధ్యాహ్నభోజనానికి ముందుగా ఏమిటీ సిద్ధం చేసుకోకపోయినా కృష్ణార్జునబోధి, రవి అందరికీ ఇంటినుంచి తీసుకొచ్చిన తినే పదార్థాలను, ట్రైన్‌లో కొన్న పండ్లను అందజేసి అకలి సమస్య రాకుండా చూసారు. సాయంత్రం నాలుగు గంటలకు మా ట్రైన్ సాంచి స్టేషన్‌కు చేరింది. సాంచికి ముందున్న రైల్వే స్టేషన్ విదిశలో బస చేసి ఆక్కడినుంచి సాంచి వెళ్లాలన్నది మాప్రణాళిక. అయితే సాంచిలో బసచేయడానికి తగిన సౌకర్యాలు న్నాయని తెలియడంతో నేరుగా సాంచి స్టేషన్‌లోనే అందరం దిగిపోయాం.



సాంచి స్టేషన్ చాలా చిన్నది. ఈ స్టేషన్‌లో దిగి రాత్రి బసకు ఏం చేయాలా? ఎక్కడికి వీలౌతుందో? అని ఆలోచిస్తున్న సమయంలోనే ఎందురుగా ఒకబంతేజీ (బౌద్ధసన్యాసి) నడుచుకుంటూ రావడం కన్పించింది. ఆయనను పామర్తి రవి అభివాదాలతో పలుకరించి తామంతా తెలుగు రాష్ట్రాల నుంచి వచ్చిన ధమ్మమిత్రులమని తమ ధమ్మయాత్ర విశేషాలను తెలియజేసారు. రాత్రి బసకు అనువైన స్థలాలగురించి ఆయనను అడిగిన వెంటనే తమ శ్రీలంక మహాబోధి సొసైటీ విహారాలో తగిన అవకాశముందని, పక్కనే వంటశాల సౌకర్యం కూడా ఉందని చెప్పడంతో ఎంతో ఆనందించాము. స్టేషన్ దాటి అక్కడకు చేరుకున్నాము.




శ్రీలంక మహాబోధి సొసైటీ వారు నిర్మించిన పురాతన భవనమది. అందులో ఒక్కో గది ఇద్దరు, ముగ్గురు చొప్పున నామమాత్రపు రుసుముతో బసచేయడానికి వీలౌతుందని నిర్వాహకులు చెప్పారు. స్నానాలు, ఇతర కాలకృత్యాలు తీర్చుకోవడానికి కూడా వంటశాల

వెనుకనే గదుల ఏర్పాటు ఉంది. ఆధునికంగా నిర్మించిన ఒక పెద్ద భవనం కూడా ఉంది. అయితే అందులో బస చేయడానికి శ్రీలంక నుంచి రెండు బస్సుల్లో ధమ్మయాత్రికులు, ఉపాసకులు పెద్దసంఖ్యలో వస్తున్నారని వారికోసం అందులో గదులనుఉంచామని నిర్వాహకులు చెప్పడంతో పాత భవనంలోని గదులతోనే మేము సరిపెట్టుకోవాల్సి వచ్చింది. మాకు గదులు కేటాయించిన చోటే పక్కన ధ్యానం చేసుకోవడానికి హాలు కూడా ఉంది. నేనూ, రవి, నందం నర్సింహరావు ఒక గదిలో మా సామాగ్రిని ఉంచుకున్నాం. వాతావరణం చిరుజల్లులతో బాగా చలిగా ఉండడం, గదుల నిండా దోమలు స్వైర విహారం చేస్తుండడంతో రాత్రంతా జాగారం తప్పదేమోని భయపడ్డాం. అయితే వాటిని తరమడానికి తగిన ఏర్పాట్లు జరగడంతో ఊపిరి పీల్చుకున్నాం. ఇక వంట ఏర్పాట్లలో పడ్డాం. నేనూ, నందం నర్సింహారావు పక్కనే ఉన్న మార్కెట్‌లో వంటగ్యాస్ స్టవ్, సిలెండర్, వంటపాత్రలు అద్దెకు తీసుకువచ్చాం, కూరగాయలు, పెరుగు, పాలు వంటివి కొనుగోలు చేసాం. దోమల సమస్యనుంచి గట్టెక్కడానికి ఏర్పాట్లు చేసుకున్నాం.



మాతో తీసుకొచ్చిన పప్పులు, బియ్యం, ఇతర సామగ్రితో వంటను ప్రారంభించేసాం. నీళ్ల క్యాన్లను కూడా కొనుగోలు చేసి తీసుకొచ్చాం. మా బృందంలోని రేకా స్వరాజ్యలక్ష్మి, చాగంటి ఆదిలక్ష్మి, అరుమళ్ల వెంకటవర్ధిని, సుంకర లక్ష్మీకామేశ్వరి, చిలకా బసవమ్మ తదితరులు కూరగాయలు తరగడంలోనూ ఇతర వంటపనిలోనూ సహకరించారు. రేకా శ్రీనివాసరావు అందరికీ రుచికరమైన భోజనాన్ని వండి వడ్డించారు. తృప్తిగా తిని నిద్రలోకి జారుకున్నాం. మేము భయపడినంతగా దోమలు ఎలాంటి ఇబ్బందులు కల్గించలేదు మాకు.




మార్చి నాలుగో తేదీ ఉదయమే మేల్కొన్నాం. మహోన్నత మానవతా మూర్తి గౌతమ బుద్ధుని చితా భస్మం, ఆయన అవశేషాల పై నిర్మించిన సాంచి స్థూపాన్ని ఎప్పుడెప్పుడు

**చూస్తామా! అని తహతహలాడుతూ ఉదయమే వేన్నీళ్లతో స్నానాన్ని ముగించాం. అంద రు కాలకృత్యాలు ముగించి వచ్చేటంతవరకూ కృష్ణార్జున బోధి మరికొంతమంది ధమ్మ మిత్రులు మెడిటేషన్ హాలులో ధ్యానంలో ఉన్నారు. ఈలోగా రేకా శ్రీనివాసరావు రుచిక రమైన ఉప్మాను అల్పాహారంగా  తయారు చేసారు. సాంచీ స్థూపాన్ని సందర్శించడానికి ముందే దాని చరిత్ర విశిష్టతను గురించి తెలుసుకున్నాం. అయితే భౌతికంగా దర్శించ నుండడం ఇదే నాకు తొలిసారి.**

## సాంచీ విశిష్టత



క్రీస్తు పూర్వం 3వ శతాబ్దానికి చెందిన అశోకచక్రవర్తి ఈ సాంచీ మహాస్థూపాన్ని నిర్మించాడు. మధ్యప్రదేశ్ రాష్ట్రం రాయసేన్ జిల్లాలో ఉన్న ఒక చిన్న గ్రామం సాంచీ. సాంచికి ఒకప్పుడు విదిశాగిరి, కకనాయ, చెటియాగిరి అనే పేర్లు కూడా ఉండేవి. బెటదా నదీ తీరంలో సాంచీ ఉంది. క్రీస్తు పూర్వం **274– 237** మధ్యకాలంలో అశోకుని హయాంలో సాంచికి ఎనలేని ప్రత్యేకత ఏర్పడింది. అయితే ఈ మహాస్థూపం కారణంగానే దీనికి అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు వచ్చింది. ఇది విదిశా నగరానికి పది కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ విదిశా నగరం అశోకుని జీవితంతో విడదీయరాని సంబంధాన్ని కలిగి ఉంది. ఆయన కాలంలో ఇది అతి ముఖ్యమైన వ్యాపార కూడళ్లలో ఒకటి.



ఆయన యవ్వన ప్రాయంలో రాజప్రతినిధిగా ఈ నగరంలో కొన్నాళ్లు నివసించాడు. నగరంలో ఒక వ్యాపార ప్రముఖుని కుమార్తెను అశోకుడు వివాహం చేసుకున్నాడు. ఆశోకునికి గల ఆరుగురి భార్యల్లో విదిశ అనే పేరుగల ఈమెకు కలిగిన సంతానమే మహేంద్రుడు, సంఘమిత్ర. వీరిద్దరూ శ్రీలంకలో బౌద్ధధర్మ వ్యాప్తికి కృషిచేసిన విషయం తెలిసిందే. అశోకుని ధర్మ ప్రబోధాన్ని శ్రీలంకలోప్రచారం చేయడానికి వెళ్లేముందు మహేంద్రుడు కొంతకాలం పాటు విదిశానగరంలో నివసించాడు.



అశోకుడు బౌద్ధ ధమ్మాన్ని స్వీకరించిన తర్వాత ధమ్మవ్యాప్తిలో భాగంగా గౌతమ బుద్ధుని చితాభస్మం, అస్థికలు, ఇతర అవశేషాలను సమీకరించి సాంచీలో అత్యంత పెద్ద

దైన స్థూపాన్ని నిర్మించాలని సంకల్పిచాడు. అందులో భాగంగానే ఏడుచోట్లఉన్న బుద్ధుని అవశేషాలను సేకరించి ఈ స్థూపాన్ని నిర్మించాడు. పక్కనే మూడో స్థూపంలో గౌతమ బుద్ధుని శిష్యులైన సారిపుత్ర, మహా మొగ్గలాయనుల అవశేషాలను నిక్షిప్తంచేసాడు. అశోకుని కాలంలో రూపుదిద్దుకున్న మహాస్థూపం, మరో రెండు స్థూపాలు, శుంగ వంశ రాజుల కాలంలో నిర్మించిన భవనాలు, అనంతరం శాతవాహనుల కాలంలో జరిగిన నిర్మాణాలు తోరణాలు, రాతి స్తంభాలు, స్థూప పునరుద్దరణలు, ఇలా మొత్తం సుమారు యాభై రకాల స్మారక స్థూపాలను, నిర్మాణాలను సాంచీ కొండపై చూడొచ్చని తెలుసు కున్నాం.



క్రీస్తు పూర్వం 3వ శతాబ్ధం నుంచి క్రీస్తు శకం 13వ శతాబ్దం వరకూ ఎంతో విశిష్టతను సంతరించుకున్న సాంచీ స్థూపం ఇతర నిర్మాణాలు ఆతర్వాత మరుగునపడిపోయాయి. అంగ్లేయుల పాలనలో క్రీస్తుశకం 1818లో జనరల్ టైలర్ అనే ఈస్టిండియా కంపెనీ అధికారి 1,2,3 స్థూపాలను కనుగొన్నాడు. సాంచీ ఉనికిని తొలిసారిగా ఆధునిక ప్రపం

చానికి వెలికితీసిన చరిత్ర పరిశోధకునిగా ఈయన గుర్తింపు పొందాడు. దాంతో ఒక పక్క ఔత్సాహిక చరిత్ర పరిశోధకులు, పురావస్తు శాస్త్రవేత్తలు ఈ సాంచీ విశేషాలపై అధ్యయనం ప్రారంభించారు.





గుప్తనిధుల అన్వేషకులు కూడా ఈ ప్రాంతాన్ని ఇష్టారాజ్యంగా తవ్వేసారు. 1881 నాటి కి ఈ స్థలాన్ని బ్రిటీష్ ప్రభుత్వం రక్షిత ప్రాంతంగా ప్రకటించింది. శిధిలావస్థలో ఉన్న మహాస్థూపం పునరుద్దరణ పనులు, ఇతర నిర్మాణాలు, అవశేషాలను భద్రపర్చడం చేసారు. ప్రస్తుతం సందర్శకులకు కన్పించే ఈ నిర్మాణాలను 1912 నుంచి 1919 మధ్యకాలంలో ప్రఖ్యాత పురావస్తు శాస్త్రవేత్త సర్ జాన్‌మార్షల్ నేతృత్వంలో పునరుద్దరిం చారు. వీటిలో ప్రధానమైనవి మూడు స్థూపాలు, పలు ఆలయాలు కూడా ఉన్నాయని తెలుస్తోంది. వీటన్నింటినీ యునెస్కో 1989లో ప్రపంచవారసత్వ సంపదగా గుర్తించింది.

జాన్ మార్షల్ నేతృత్వంలోనే సాంచి కొండపై లభించిన విగ్రహాలు, ఇతర పురాతత్వ అవశేషాలతో కొండ దిగువ ఒక పెద్ద మ్యూజియం ఏర్పాటు చేసారు.



పాచీన కట్టడాలలో అత్యంత ప్రముఖమైనదిగా సాంచీ గుర్తింపు పొందింది. బ్రిటీష్ వారు ఈ దేశంలో తమ పరిపాలనాకాలంలో వైస్రాయ్ నివసించే భవనాన్ని విశిష్టమైన కళాకౌశలంతో నిర్మించాలని భావించారు. అందుకోసం అంతర్జాతీయ స్థాయిలో పేరెన్నికగన్న ఎన్నో కట్టదాల  నమూనాలను పరిశీలించారు. చివరికి సాంచీ స్థూప నమూనా తో దేనినీ సరిపోల్చుకోలేక దానిని వైస్రాయ్ భవనం పై మకుటంగా కట్టించారు. అదే ఇప్పుడు రాష్ట్రపతి భవన్‌గా విలసిల్లుతోంది. అంతేకాదు ప్రపంచంలోనే అత్యంత అరుదైన కట్టడాల్లో ఒకటిగా, ప్రపంచ వింతగా కళావిమర్శకుల ప్రశంసలు అందుకుంటున్న తాజ్‌మహల్ నిర్మాణంలో కూడా సాంచీ స్థూప నమూనాను వినియోగించారు.అందువల్లే తాజ్‌మహల్ పై భాగంలో ఉన్న గోళాకార నిర్మాణం సాంచీ స్థూపాన్నే పోలి ఉంది.

ఇన్ని విశిష్టతలున్న సాంచీ స్థూప సందర్శన కోసం మేమంతా అసక్తిగా చర్చించుకుంటు న్న సమయంలో మమ్మల్ని అక్కడకు తీసుకు వెళ్లడానికి ఒక స్కార్పియో, మరో బొలిరో వాహనాలను పామర్తి రవి ఏర్పాటు చేసారు.

## సాంచి సందర్శన



శ్రీలంక మహాబోధి సొసైటీ ప్రాంగణం నుంచి బయలుదేరి రెండు వాహానాల్లో మే మంతా సాంచిస్థూపం ఉన్న కొండ పైభాగానికి చేరుకున్నాం. అంతకు ముందు మాకు కొంత దూరం నుంచే సాంచీ మహా స్థూపం కనువిందు చేస్తూ కన్పించింది. స్థూపం ఇతర ప్రధాన విశేషాల సందర్శనకు భారతపురావస్తు సర్వేక్షణ శాఖ  ఏర్పాటు చేసిన కౌంటర్‌లో టిక్కెట్లు తీసుకున్నాం. దానిని ఆనుకునే పురావస్తు శాఖ ప్రచురణల విభాగం

నిర్వహిస్తున్న స్టాల్ కూడా ఉంది. మేమంతా అందులోకి వెళ్లాం. దేశంలోని ప్రాచీన నిర్మాణాలు వాంటి వాటిపై చాలా పుస్తకాలుఉన్నాయి అందులో. దాదాపు అన్నిపుస్తకాలు ఇంగ్లీష్‌లో ఉన్నాయి. ధర కొంతఎక్కువగా అన్పించినా వాటి ముద్రణ, చక్కని ఛాయా చిత్రాలు రంగురంగుల్లో ప్రతీ పుస్తకంలోనూ దర్శనమిచ్చాయి. నేనూ, ఆలీ, బోధి కొన్ని పుస్తకాలు తీసుకున్నాం. అక్కడే ఒక ఉద్యోగి గైడ్‌గా వస్తానని మాతో చెప్పారు. కానీ గైడ్‌గా సర్వీస్ చేసినందుకు చెల్లించాల్సిన సొమ్ము కూడా కాస్తా ఎక్కువగా అన్పించడం తో ఇంకెవరైనా గైడ్లు ఉంటారేమోనని వెతికాం. తర్వాత తెలిసింది అక్కడ ప్రైవేట్ గైడ్లు ఎవరూ ఉండరని పురావస్తు శాఖ సిబ్బందే గైడ్లుగా వ్యవహరిస్తుంటారని. చేసేదిలేక ఆత నినే గైడ్‌గా మాట్లాడుకుని ఆయనతో పాటు మేమంతా లోపలకు నడిచాము.



మహాస్థూపంలాంటివే పరిమాణంలో చిన్నవిగా ఉన్న మరో రెండు స్థూపాలు కూడా మాకు కన్పించాయి. మేము ముందుగా మహా స్థూపం వైపు ఉన్న మార్గంలో వెళ్లాము.



మాతో పాటు వస్తున్న గైడ్ మాకు సాంచి విశిష్టతని హిందీలో వివరిస్తున్నారు....."మధ్య ప్రదేశ్‌లోని రైసిన్ జిల్లాలో ఉన్న ఈ ప్రదేశం ప్రాచీనకాలం నుంచీ గుర్తింపుపొందింది. అప్పట్లో సాంచికి "కాకనాయ" అనే ప్రాచీనమైన నామం ఉండేది. భోపాల్ నగరానికి **30** కిలో మీటర్ల దూరంలో **91**మీటర్ల ఎత్తులో ఉన్న కొండపై ఈ సాంచీ స్థూపం ఉంది. దీని పక్కనే ఉన్న విదిశ ఒకప్పుడు తూర్పుమాళ్వా (ప్రాచీన కాలంలో ఆకర రాజ్యం) నకు రాజధానిగా ఉండేది. సాంచి స్థూపానికి చుట్టుపక్కలా **20** కిలోమీటర్ల విస్తీర్ణంలో బౌద్ధ నిర్మాణాలు అనేకం చారిత్రక పరిశోధకులకు లభించాయి. సమ్రాట్ ఆశోకుని కాలం (క్రీ.పూ**273-236**)లో సాంచీ స్థూపాన్ని నిర్మించారు. తన యవ్వనకాలంలో రాజప్రతినిధిగా ఉన్న సమయంలో ఆశోకుడు విదిశానగరంలో ఉండేవాడు. అప్పట్లో విదిశానగరంలో ఒక వ్యాపారి కుమార్తె విదిశాదేవిని వివాహం చేసుకున్న అశోకుడు ఆమెద్వారా మహేంద్రుడు, సంఘమిత్ర అనే కొడుకు, కూతురును కన్నాడు. కళింగ యుద్ధం తర్వాత బౌద్ధ ధమ్మాన్ని స్వీకరించిన అశోకుడు తన జీవితంతో ముఖ్యంగా ముడిపడి ఉన్న విదిశ ప్రాంతంలో ఉన్న సాంచి కొండమీద విహారాలను, స్థూపాన్ని నిర్మించడానికి అను కూలమైనదిగా ఎంపిక చేసాడు.



ఈ ప్రదేశం ప్రశాంతవాతావరణంలో ధ్యానానికి అనుకూలంగా ఉంటుందని ఆయన భావించాడు. అంతేకాకుండా ఈ ప్రాంతం బెత్వా, బెస్ నదుల మధ్య ఉండడం, రెండు ప్రధాన వాణిజ్య మార్గాలకు కూడలిగా ఉండడంతో ఈ ప్రదేశాన్నే స్థూపనిర్మాణానికి ఎంపిక చేసాడు. సాంచీ నిర్మాణాలను రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. వాటిలో కొండపైన ఉన్న మహాస్థూపం ఇతర నిర్మాణాలు ఒకరకానికి చెందినవి అనుకుంటే కొండకు పశ్చిమవాలులో ఉన్నవి రెండో రకంగా భావించాలి.

కొండపైన అసమగ్రాకారంలో ఉన్న పీఠభూమి వంటి ప్రదేశంలో ముఖ్యమైన నిర్మాణాలున్నాయి. ఇవి ఉత్తర దక్షిణ దిశల్లో 384మీటర్లు, తూర్పు పడమర దిశల్లో 201మీటర్ల మధ్య విస్తరించి ఉన్నాయి. వీటిలో మూడు ముఖ్యమైన భాగాలున్నాయి. ఒకటి ప్రధాన ఉపరితలం, రెండోది తూర్పు ప్రదేశం, మూడోది దక్షిణ ప్రదేశం. ఇవన్నీ క్రీస్తు పూర్వం 3 వశతాబ్దం నుంచి క్రీస్తుశకం 12వ శతాబ్దం మధ్యకాలం వరకూ నిర్మి

ంచారు. ఈ నిర్మాణాలను పరిశోధించిన సర్ జాన్‌మార్షల్1నుంచి50 వరకూ నెంబర్లను కూడా ఇచ్చారు. అయితే అంతకుముందు కన్నింగ్‌హామ్ పెట్టిననెంబర్లను స్వల్పమార్పు లతో ఈయన వాటికి పెట్టారు. ఈ కొండ దిగువభాగం నుంచి పైకి రావడానికి మెట్ల మార్గం కూడా ఉంది......" ఇలా మాకు గైడ్ హిందీ చెబుతున్న విషయాలను లియాఖ త్ ఆలీ తెలుగులో తర్జుమా చేస్తూ వివరిస్తుండగానే మేము సాంచి మహాస్థూపం వద్దకు చేరుకున్నాం.



ఈ మహాస్థూపానికి నాలుగు దిశల్లో నాలుగు ప్రవేశ ద్వారాలున్నాయి. ఈ మహాస్థూపం అర్ధగోళాకార రూపంలో ఉంది. పైన మూడు వరుసల్లో చత్రం ఉంది. దానిని త్రి రత్నా లకు ప్రతీకగా నిర్మించారని కృష్ణార్జున బోధి చెప్పారు. ఈ స్థూపం ఎత్తు 36.6 మీటర్ల ఎత్తు ఉందని, దానిపై నిర్మించిన ఛత్రం ఎత్తు 16.4 మీటర్లని మొత్తంఎత్తు 53 మీటర్లని , స్థూపం చుట్టుకొలత 120 మీటర్లని పక్కనే ఉన్న శిలాఫలకం పై రాసి ఉంది. అశోకుడు నిర్మించినస్థూపం అతని తదనంతరకాలంలో శత్రువులదాడుల్లో చాలావరకూ నాశనం కాగా శుంగుల కాలంలో క్రీస్తుపూర్వం 2వ శతాబ్దం తర్వాత పునర్నిర్మాణం జరిపి పెద్దదిగా మార్చారని తెలిసింది. ఈ స్థూపం పైకి వెళ్లడానికి మెట్లదారి కూడా

ఉంది. దీని చుట్టూ వలయాకారంలో ప్రదక్షిణలు చేయడానికి సరిపోయేటంత మార్గం ఉంది.



అశోకుని ఇతర నిర్మాణాలను పోలినట్లు ఒకే పరిమాణంలో ఉన్న పెద్ద పెద్ద ఇటుక లను ఇక్కడ వినియోగించారు. ఛత్రం చుట్టూ చునార్ శాండ్‌స్టోన్ (ఇసుకరాయి)తో నిర్మాణాన్ని ఒక ప్రహారీలా రూపొందించారు. వీటి కిందనే బుద్ధుని అస్థికలను ఉంచి వాటికి నీడనిచ్చే విధంగా పై భాగాన్ని ఛత్రంగా నిర్మాణం చేసారు. ఈస్థూపానికి చుట్టూ ప్రదక్షిణ మార్గం, వెలుపల పాలరాతి ప్రహరీగోడ ఉన్నాయి. ఈ మహాస్థూపానికి ఉన్న నాలుగు తోరణ ద్వారాల్లో దక్షిణ దిశలో ఉన్నది మొదటి ద్వారంగా చెబుతారు. అక్కడే ఆశోకుని స్తంభం, పైకి వలయాకార మార్గంలోకి వెళ్లడానికి వీలుగా మెట్ల వరుస

కూడా అక్కడే ప్రారంభమౌతుంది. మిగిలిన ఉత్తర, తూర్పు, పడమర దిశల్లోని ద్వారాలు ఆతర్వాత కాలంలో నిర్మించారని గైడ్ మాకు చెప్పారు. ఈ ద్వారాల ఎత్తు 8.53మీటర్లు. ఈ ద్వారాల్లోని స్తంభాల్లో మూడు ఆర్చిలు చొప్పున నిర్మించారు. నాలుగు చతురస్ర భాగాలుగా వాటిని రూపొందించారు. వీటిలో రెండింటిని బాలమిత్ర అనే బౌద్ధ ఉపాసిక దానంగా ఇచ్చారని తెలుస్తోంది. మరో రెండింటిని కురారా గ్రామానికి చెందిన నాగపియ అనే బౌద్ధ ఉపాసిక బహుకరించారని గైడ్ చెప్పారు.



దక్షిణ ద్వారం చాలా వరకూ శిధిలమైంది. కానీ ఉత్తర ద్వారం బాగా స్థిరంగా ఉంది. దాని శిల్పకళాసౌందర్యాన్నిచూసి మిగిలిన స్తంభాలపనితనపు నైపుణ్యాన్ని పోల్చుకోవచ్చు.

ప్రతి ప్రవేశ ద్వారం వద్ద లోపలికి వెళ్లగానే ఎదురుగా బుద్ధుని విగ్రహాలున్నాయి. అవి కొన్ని విరిగిపోయి ఉండడం బాధ అన్పించింది. పడమటి దిశలో ఉన్న ద్వారంపై బుద్ధుని జీవితంలో ఏడు ముఖ్యమైన ఘట్టాలను శిల్పాలుగా చిత్రీకరించారు.



దక్షిణ ద్వారంలో బుద్ధుని జనన సన్నివేశం, తూర్పు దిక్కున ఆయన రాజ్యాన్ని విడిచిపెట్టి వెళ్తుండడం, నీటిపై నడుస్తున్న దృశ్యం, ఉత్తరం వైపు ఒక వృక్షం కింద కూర్చొని బుద్ధుడు బోధలు చేస్తున్నట్లు, బుద్ధుని కాళ్ల నుంచి అగ్నిశిఖలు, తలనుంచి జల ప్రవాహాలు, దేవతలు బుద్ధుని గొప్పతనాన్ని మంగళవాయిద్యాలతో చాటు తున్నట్లు పలు దృశ్యాలు కన్పించాయి.

ఈ స్తంబాలు, ఆర్చిలపై జాతక కథల్లో ముఖ్యమైన 'చద్దాంత జాతక, సామజాతక, మహాకపి జాతక, వెస్సాంతర జాతక, అలంబస జాతక...తదితర గాథల్లోని ముఖ్య సన్నివేశాలను సునిశితమైన శిల్పకళద్వారా ఆవిష్కరించారు. ప్రతీ తోరణ ద్వారం వద్దా రెండు ఆర్చీలపై నాలుగువైపులా నాలుగుసింహాలు, ఏనుగులను శిల్పాలుగా మలిచారు

. బానపొట్టలతో వాటిని భారంగా మోస్తున్న మనుషుల హావభావాలను ప్రదర్శించే విధ ంగా శిల్పాలు చెక్కారు.



దిగువ ఆర్చిలపై అశ్వికులు, ఏనుగులను తోలుతున్నవారు, సాలబంజికల శిల్పాలు కన్పిస్తున్నాయి. కొన్ని ఆర్చిలపై ధర్మచక్రం, బుద్ధ,ధమ్మ,సంఘ త్రిశరణాలను కూడా చెక్కి ఉన్నారు. తామర పువ్వులను సునిశితమైన శైలిలో చెక్కారు.ఈ ఆర్చ్‌లపై శిల్పాల ను నాలుగు రకాలుగా విభజించ వచ్చు. జాతక కథలలోని దృశ్యాలు, బుద్ధుని జీవిత దృశ్యాలు, బౌద్ధమతంలోని పరిణామాలకు సంబంధించిన దృశ్యాలు, వివిధ రకాల పుష్పాలు,చెట్లు,జంతువుల శిల్పాలుగా వాటిని మేము గమనించాం. బుద్ధునికి బదులుగా ఆయనని ఒక ధమ్మప్రతీకగా భావించి శిల్పకళాకారులు వివిధ లక్షణాలను ఆపాదించి అందుకు అనుగుణంగా ఆయన విడిచిపెట్టిన అశ్వం, పాదముద్రలు, బోధివృక్షం, ఇలా రకరకాల గుర్తులు చెక్కి ఆ మహనీయునికి మానవదేహం పరిమితం కాదనే ఊహతో చెక్కారని అన్పించింది. ఆనాటి శిల్పులు రాతి, ఏనుగుదంతం, లోహ ఉపకరణాలతో వీటిని చెక్కారని తెలుస్తోంది.

బుద్ధుని చితా భస్మం ఉన్న మొదటి స్థూపాన్ని చాలా అందంగా రూపొందించారు. మిగిలిన రెండు స్థూపాలు పరిమాణం రీత్యా కూడా బగా చిన్నవి. వాటినిర్మాణంలో అంత పనితనం కన్పించడం లేదు. ఈ స్థూపంలో రెండు రాతి పేటికలు లభించాయని, వాటిలో పూసలు,ముత్యాలతో ఉన్న ఎముకలుకూడా లభించాయని, వాటిపైరాసిన అక్ష కాలను బట్టి అవి బుద్ధుని ప్రధానశిష్యుల్లో ముఖ్యులైన సారిపుత్ర, మహామగ్గలాయన్‌లవి

అని గైడ్ చెప్పారు. ప్రస్తుతం ఆరాతి పేటికలు లండన్‌లో ఉన్నాయని  తెలిపారు.



ఈ  స్థూపాలతో పాటు రకరకాల ఇక్కడ నిర్మాణాలు ఉన్నాయి. వివిధ పరిమాణాల్లో పు నాదుల వరకే నిర్మించిన స్థూపాలు అనేకం ఉన్నాయి. ఇవన్నీ బౌద్ధ బిక్షువుల సమాధులై ఉంటాయని మేము భావించాము.  చిన్న  చిన్న గుడుల సముదాయాలు కూడా ఉన్నా యి. సుమారు 50 వరకూ రకరకాల నిర్మాణాలు ఇక్కడున్నాయి. ప్రధాన స్థూపాలను శు ంగ వంశరాజుల కాలంలో పునరుద్దరించగా, క్రీస్తు శకం 70లో శాతవాహనుల పాలన లో తోరణ ద్వారాలను, స్తంభాలను, రాతి స్తంభాలను నిర్మాణం చేసారని గైడ్ చెప్పారు.

గుప్తుల కాలంలో వివిధ రకాల గుడులు నిర్మించారని, బుద్ధుని విగ్రహాలను కూడా అప్పుడే నెలకొల్పారని ఆయనే తెలిపారు. బౌద్ధాభిమానులైన ప్రజల విరాళాలతోనే ఈ నిర్మాణాలను చేసారని గైడ్ మాకు వివరించారు. మా ధమ్మ మిత్రుల బృందం అక్కడున్న అన్ని చారిత్రక అవశేషాలను పరిశీలించింది. ధమ్మమిత్రుడు నరసింహారావు ఈ సంద ర్శన అంతటినీ ఛాయాచిత్రాలుగా, వీడియో దృశ్యాలుగా చిత్రీకరించారు.

అక్కడే సమీపంలో ఏర్పాటు చేసిన వస్తు విక్రయశాలను కూడా సందర్శించాం. అయితే ధరలు చాలా ఎక్కువగా ఉండడంతో వాటిని కొనుగోలు చేయలేదు. అందరం తిరిగి

మా వాహనాల వద్దకు చేరుకున్నాం. వాటిలో దిగువకు బయలుదేరాం.    అందరూ ముందురోజు బసచేసిన శ్రీలంక మహాబోధి సొసైటీ విహారకు చేరుకోవాలనే ఉత్సుకత తో ఉన్నారు. ఇంతలో మాకు సాంచి బౌద్ధ ప్రదర్శనశాల కన్పించింది. మా వాహనాన్ని ఆపించి నేనూ, సుంకర కృపాకరరావు, శ్రీమతి లక్ష్మీ కామేశ్వరి దిగాం. మ్యూజియంలో నికి వెళ్లాం.




లోపల ఫొటోలు తీయరాదనే నిబంధనలు ఉన్నాయి. నేను వాటిని చూసుకోకుండా నా మొబైల్‌తో కొన్ని ఫొటోలు తీసాను. ఇంతలో సెక్యూరిటీ సిబ్బంది వచ్చి వారించడం తో దానిని స్విచ్‌ఆఫ్‌చేసాను.  సాంచి కొండపై లభించిన పలురకాల బౌద్ధ అవశేషాలను ఇందులో భద్రపరిచారు. మొత్తం  ఐదు  హాళ్లలో వీటిని ఏర్పాటు చేసారు.



సాంచి స్థూపం వద్ద జరిగిన ఆనాటి చరిత్ర పరిశోధనలను ఛాయాచిత్రాలుగా, పరిశోధకులు జాన్‌మార్షల్, డయ్యర్ తదితరులు ఉపయోగించిన వస్తు సామగ్రి, టేబుళ్లు, మ్యాపులు తదితర పురావస్తువులను కూడా జాగ్రత్త చేసారు. బుద్ధుని అవశేషాలను ఒక భరిణెలో ఉంచి దానిని సందర్శకులు చూడడానికి వీలుగా చుట్టూ అద్దాలను అమర్చారు . బుద్ధుని బోగిణిని రాతితో చెక్కి ఉంచారు. ఇందులోనే ఆనాటి బౌద్ధ బిక్షువులకు వండిన ఆహార పదార్ధాలను అందించేవారు. సాంచీ తవ్వకాలలో వెలుగుచూసిన అశోక స్తంభం,బౌద్ధ బిక్షువులు ఉపయోగించిన పాత్రలు వంటివి చాలా ఉన్నాయి. సాంచీలో శిల్పాలు చెక్కడానికి ఆనాటి శిల్పకళాకారులు ఉపయోగించిన ఉపకరణాలను కూడా సందర్శకుల పరిశీలనార్ధమై ఇక్కడ ఉంచారు. అక్కడ నుంచి మేము కాలినడకన దగ్గరలోనే ఉన్న శ్రీలంక మహాబోధి సొసైటీ విహార వద్దకు చేరుకున్నాము. మిగిలిన ధమ్మ మిత్రులు భోజనాలకు సిద్ధం అవుతుండడంతో అందరం ఆహారం తీసుకొని, మేము వంటకోసం తీసుకొచ్చిన సామాగ్రిని మార్కెట్లో ఎవరిది వారికి అందజేసాము. తర్వాత కొంత సమయం విశ్రాంతి తీసుకున్నాం.

సాయంత్రం ఐదు గంటలకు నాగపూర్ వెళ్లడానికి ట్రైన్ ఉండడంతో నాలుగున్నర గంటలకే మా లగేజీలతో విదిశా రైల్వే స్టేషన్‌కు బయలుదేరాం. మా సాంచి సందర్శన చాలా ఉత్తేజకరంగా,మంగళకరంగా సాగింది.

## నాగపూర్‌లో రెండు రోజులు




విదిశా రైల్వేస్టేషన్‌కు చేరుకున్న మేమంతా మహారాష్ట్రలోని నాగపూర్ వెళ్లే ట్రెయిన్‌కోసం గంటన్నర సమయం నిరీక్షించాల్సి వచ్చింది. ఎట్టకేలకు నాగపూర్ వెళ్లే ట్రైన్ రానే వచ్చింది. మాకు ముందుగానే రిజర్వేషన్ చేయించుకున్న బెర్తులున్నప్పటికీ మా సీట్లను మేము సంపాదించుకోవడానికి కొంత కష్టపడాల్సి వచ్చింది. మాతో పాటు తెచ్చుకున్న ఆహారపదార్థాలను తిన్నాం. ఇక నిద్రకు ఉపక్రమించాం. మార్చి నాలుగో తేదీ ఉదయం నాలుగున్నర గంటలకే మేము ఎక్కిన ట్రైను నాగపూర్ రైల్వే స్టేషన్‌కు

చేరుకుంది. అప్పటి వరకూ మేము చూసిన రైల్వే స్టేషన్లలో విజయవాడను మినహాయిస్తే నాగపూర్ రైల్వే స్టేషన్కూడా చాలా పెద్దదిగా ఉంది. స్టేషన్ నుంచి బయటకు వెళ్లడాని కి విశాలమైన రోడ్లున్నాయి. లగేజీలతో మెట్లు ఎక్కి, దిగే శ్రమ లేకుండా సునాయాసం గా లోపలికి వెళ్లడానికి బయటకు రావడానికి ఇవి ఎంతో అనువుగా ఉన్నాయి. అంతకు ముందే మా ధమ్మయాత్ర నిర్వాహకులు పామర్తి రవి నాగపూర్లో ఎమ్మెల్సీగా ఉన్న జోగేందర్ కవాడే గారితో సంప్రదించి ఆయన సహకారంతో ఎమ్మెల్యే హాస్టల్లో వసతిని రిజర్వ్ చేసిఉన్నారు. దాంతో తెల్లవారుజామునే నాగపూర్లో అడుగు పెట్టినప్పటికీ ఎక్కడ ఉండాలి అనే విషయంలో ఎలాంటి ఆదుర్దాలేకుండా స్టేషన్ బయటకు వచ్చాము . బయట మినీబస్సు రెడీగా ఉండడంతో అందులో ఎక్కి ఎమ్మెల్యేహాస్టల్కు చేరుకున్నాం.



ఎమ్మెల్యే హస్టల్ భవనాలే కాదు వాటిలో ఉన్న గదులు కూడా చాలా విశాలమైనవి. రవి ఇద్దరు ముగ్గురు ధమ్మమిత్రులకు ఒక్కో గదిని కేటాయించారు. సాంచీ వరకూ మాతో వచ్చిన ధమ్మ మిత్రులు సుంకర కృపాకర రావు, ఆయన సతీమణి లక్ష్మీకామేశ్వరి అనివార్య కారణాల వలన వేగంగా విజయవాడ వెళ్లాల్సివచ్చింది. మేమంతా రూములకు చేరుకుని కాలకృత్యాలను తీర్చుకున్నాం. హాస్టల్ ఆవరణలో వంట ఏర్పాట్లు చేసుకోవడానికి తగిన స్థలం కోసం వెతికాము. అయితే కొన్ని కారణాల వలన అది సాధ్యంకాదని తేలింది. బయట హెూటళ్లపైనే భోజనానికి, అల్పాహారానికి అధారపడక తప్పదని తేలింది. ఎమ్మెల్యే హాస్టల్ ప్రహరీ బయట రుచికరమైన ఇడ్లీ, దోసెలు అమ్ముతుండడంతో వాటిని కొని తిన్నాం. వాటిని అమ్మే అతనితో మాట్లాడగా తేలిందేమిటంటే అతను శ్రీకాకుళం జిల్లాకు చెందినవాడేనని. ఒకవైపు టిఫిన్లు బండితో చేసి అమ్ముకుంటూనే పది గంటల తర్వాత నుంచి ఒక హెూటల్‌లో కూడా పని చేస్తానని అతను మాకు వివరించాడు. అల్పాహారాలు ముగించి అందరం ముందుగానే బుక్‌చేసుకున్న బస్‌లో ‘దీక్షాభూమి’కి వెళ్లాం.



నాగపూర్ పట్టణానికి ఐదుకిలో మీటర్ల దూరంలో ఉన్న ఈ దీక్షాభూమికూడా ప్రస్తుతం పట్టణంలోనే ఉన్నట్లు కన్పిస్తుంది. **1956** అక్టోబర్ **14**వ తేదీన బాబాసాహెబ్ డాక్టర్ బి ఆర్ అంబేద్కర్ హిందూ సమాజంలో నిమ్నస్థాయిలో ఉన్న సుమారు ఐదు లక్షల మంది దళితులకు ఈస్థలంలోనే బౌద్ధధర్మదీక్షను తనతో పాటు ఇప్పించారు.ఆ ప్రభావం ఇప్పటికీ నాగపూర్‌లో ప్రతిచోటా మాకు కన్పించింది. ఈ పట్టణం లో ఉన్న హిందూ దేవాలయాల కన్నా బౌద్ధ నిర్మాణాలే అధికంగా ఉన్నాయి. ఈ దీక్షాభూమిలో అనాటి మహత్తర  సంఘటనకు గుర్తుగా పెద్ద స్థూపాన్ని నిర్మించారు. ఈ స్థూపాన్ని సుప్రసిద్ధ ఆర్కిటెక్టు షెయోడాన్‌మాల్ డిజైన్ చేసారు. దీని నిర్మాణానికి **23** సంవత్సరాలు పట్టింది. సాంచీ స్థూపాన్ని పోలిన విధంగా ఈ నిర్మాణం సాగింది. దీనిని **2001**డిసెంబర్ **18**న భారత రాష్ట్రపతి డాక్టర్ కె ఆర్ నారాయణ్ ప్రారంభించారు. ఈ స్థూపంలోకి మేమంతా వెళ్లాం. లోపల **211** చదరపు అడుగుల విస్తీర్ణంలో పెద్ద హాలు ఉంది. హాలు మధ్యలో బుద్ధుని విగ్రహం, అంబేద్కర్ ఫోటో ఉన్నాయి. గోడలకు అంబేద్కర్ జీవిత దృశ్యాలు, ధమ్మదీక్షకు సంబంధించిన ఛాయాచిత్రాలు అనేకం ఏర్పాటు చేసారు. గౌతమ బుద్ధుని జీవిత సంఘటనల తైలవర్ణ చిత్రాలు కూడా చాలా ఉన్నాయి.



ఈ హాలులో చాలా సమయం గడిపాము. దీక్షాభూమి ఆవరణలో గల పుస్తకాలషాపులో పుస్తకాలు కొనాలని అనుకున్నాం. అయితే ఆరోజు ఎందుకోదానిని తెరవలేదు. దీక్షాభూమి బయటనగల ఫుట్‌పాత్‌పై అమ్ముతున్న పలు పుస్తకాలను చూసాం. వాటిలో ఇంగ్లీషు పుస్తకాల కన్నా హిందీ, మరాఠీ భాషల్లో రాసిన పుస్తకాలే ఎక్కువగా ఉన్నాయి.



అక్కడి నుంచి బస్సులో బయలుదేరి  నాగలోక్ ఆనే ప్రాంతానికి వెళ్లాలనుకున్నాం. దారిలో బస్సులో డీజిల్ పోయించుకుని అక్కడే ఐస్‌కాండీలు అందరమూ తిన్నాం. బస్సులో నాగలోక్ చేరుకున్నాం. అక్కడ సువిశాలమైన ప్రదేశంలో నిర్మించిన విద్యాలయ ం, విద్యార్థుల వసతి గృహాలు, కేంటీన్, పుస్తకాలు, ఫోటోలు, శిల్పాలు ఇతర వస్తువిక్ర యశాల అన్నీ ఉన్నాయి. అన్నింటి కన్నా అక్కడ మాకు బాగా ఆకర్షించింది సుమారు ఎనభై అడుగుల పొడవున్న బుద్ధుని విగ్రహం.



ఆది ఆధునిక కాలంలో నిర్మించినదైనా అత్యంత ఆకర్షణీయంగా ఉంది. దాని దగ్గర కూర్చొని, నిల్చొని చాలా ఫొటోలు తీయించుకున్నాం. ధమ్మమిత్రులు నందం నరసింహారావు ఫొటోలతోపాటు వీడియో కూడా తీసారు. ఈ నాగలోక్‌లో అందమైన ఉద్యాన వనాలుగా దారికి ఇరువైపులా అత్యంత శ్రద్ధతో పూల మొక్కల పెంపకం జరుగుతోంది . అక్కడ ఉన్న పుస్తక,వస్తు విక్రయశాలలోకి అందరం వెళ్లాము. మాకునచ్చిన పుస్తకాలు , సీడీలు, బుద్ధుని బొమ్మలు, ఇతర వస్తువులను కొనుగోలు చేసాము. పక్కనే ఉన్న మెస్‌కు వెళ్లాము. మాకు భోజనాల ఏర్పాట్ల గురించి అక్కడివారితో పామర్తి రవి మాట్లాడారు . అక్కడి వంటశాలలో తెలుగు తెలిసిన మహిళ కూడా ఒకరున్నారు.

ఆమె తనది శ్రీకాకుళం జిల్లాలోని మందస ప్రాంతమని చెప్పారు. మెస్ హాలులో కొంతమంది విద్యార్థులతోపాటు మేము కూడా రుచికరమైన భోజనం చేసాం. బుద్ధిజం

అంబేద్కర్ స్టడీస్ తదితర కోర్సులుమాత్రమే ప్రత్యేకంగా ఈ విద్యాలయంలో బోధిస్తారని విద్యార్థులు చెప్పారు. తెలంగాణ రాష్ట్రానికి చెందిన విదార్థులు కూడా ఇక్కడ మమ్మల్ని కలిసి ముచ్చటించారు. మధ్యాహ్నం మూడు గంటల వరకూ అక్కడే గడిపిన బస్సులో తిరిగి బయలుదేరాము. దారిపొడవునా వివిధ బౌద్ధ విహారాలని సందర్శించుకుంటూ సాయంత్రానికి డ్రాగన్ ప్యాలెస్ అనే బౌద్ధ విహారం వద్దకు చేరాము. లోపలకు వెళ్తుంటే ఎంతో పచ్చదనంతో అంతా ప్రశాంతంగా కన్పించింది. చైనా-జపాన్ నిర్మాణశైలిలో దీనిని న్మించారు. పూర్తిగా అద్దాలతో త్రిభుజాకారంలో పెద్దదిగా ఉంది. మధ్యలో పాలరాతి తో చెక్కిన బౌద్ధ విగ్రహాన్ని ఏర్పాటు చేసారు. లోపల ప్రశాంతంగా ఉండడంతో మేమంతా కాసేపు అందులో కూర్చొన్నాం.



అక్కడనుంచి బస్సులో బయలుదేరిన మేము మరి కొన్ని విహారాలను చూసాము. ఆధుని క కాలంలో వీటిని నిర్మించారు. హిందూ అలయాలకు వెళ్తున్నట్లే స్థానికులు ఈ విహారాలను సందర్శిస్తూ  బుద్ధుని విగ్రహాలకు నమస్కారం చేసి విరాళాలు సమర్పించుకుంటు న్నారు. కొన్ని విహారాల్లో బౌద్ధ దీక్ష పొందిన బాలలు కూడా చాలామంది ఉన్నారు. వారి కి పండ్లు, బిస్కెట్లు అందజేసాము.



రాత్రి సమయానికి  ఎమ్మెల్సీ జోగీందర్ కవాడే నివాసానికి వెళ్లాము. ప్రొఫెసర్ జోగేంద్ర కవాడే కేవలం ఎమ్మెల్సీ మాత్రమేకారు,  మహారాష్ట్ర దళిత్ ముక్తిసేన వ్యవస్థాపకులు, పీపుల్స్ రిపబ్లికన్ పార్టీ అధ్యక్షుడు కూడా. చాలా నిరాడంబరమైన జీవితాన్ని ఆయన ఆయన భార్య అక్కడ గడుపుతున్నారు. తెలుగు రాష్ట్రాల్లోని రాజకీయ నాయకుల దర్పానికి భిన్నంగా ఒక అపార్ట్మెంటులోని సింగిల్ బెడ్రూమ్ ఫ్లాట్లో

ఆ దంపతులు నివాసం ఉంటున్నారు. వారిద్దరూ మా బృందాన్ని ఎంతో అభిమానంతో, ఆత్మీయతలతో పలకరించి టీలు, ఫలహారాలు అందించారు. అక్కడే కొంత సమయం గడిపి ఆయనతో ఫోటోలు దిగాం. తాను చాలాసార్లు ఆంధ్రప్రదేశ్‌కు వచ్చానని చెప్పారు . ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లా వంగర మండలం లక్ష్మింపేటలో 2012 జూన్‌నెలలో దళితులపై దాడి జరిగిన నేపథ్యంలో తాను వచ్చానని చెప్పారు. సామాజిక అసమానతలు ఇంకా ఆంధ్రాలో తీవ్రంగానే ఉన్నాయని అన్నారు. ఆయనకు మాతో తీసుకొచ్చిన కొన్ని పుస్తకాలు అందజేసాము.



తిరిగి వచ్చే దారిలో ఒక హెూటల్‌లో రాత్రి భోజనాలు పూర్తిచేసాము. తర్వాత రోజు కూడా నాగపూర్‌లోనే ఉండాల్సి వచ్చింది. ఆరోజు హెూళీ పండగ కావడంతో నాగపూర్ లో అంతా శెలవు పాటిస్తారని, పండగ సందర్భంగా హడావిడి కూడా ఎక్కువ ఉంటుం దని తెలుసుకున్న మేము ఈ పట్టణానికి బయట ఉన్న బౌద్ధ స్థలాలను చూడాలని భావి ంచాము. అందులో భాగంగా చాలా దూరం బస్సులో ప్రయాణం చేసి బోరుబుదురు అన్న స్థూపాన్ని చేరుకున్నాం. అక్కడ చైనాబౌద్ధయాత్రికుడు హుయాన్‌త్స్యాంగ్ విగ్రహం ఉంది.



ఈ స్థూపం వద్ద చాలా సమయం గడిపాము. ఇది కూడా ఆధునికంగా నిర్మించినదే అయినా  సందర్శకుల తాకిడి అధికంగానే ఉంది. అక్కడేమైనా భోజనాల ఏర్పాట్లు జరు గుతాయోనని ప్రయత్నించాం. వీలు కుదరకపోడంతో అక్కడనుంచి బయలుదేరి దారిలో బొప్పాయిపండ్లు కొనుక్కుని తిన్నాం. సాయంత్ర సమయానికి మేము బసచేసిన ఎమ్మెల్యే హాస్టల్‌కు చేరుకున్నాం. రాత్రి భోజనాన్నికూడా బయట హొటల్‌లోనేచేయాల్సివచ్చింది, గత వారంరోజుగా మేము జరిపిన ధమ్మయాత్రను కృష్ణార్జునబోధి నేతృత్వంలో సమీక్షిం చుకున్నాం. ఎంతో ఫలప్రదంగా జరిగిందని అంతా చెప్పారు. అందరం ఎవరి గదుల్లో వారు నిద్రకు ఉపక్రమించాం. మరుసటిరోజు ఉదయమే నాగపూర్ రైల్వేస్టేషన్ నుంచి విజయవాడ వెళ్లడానికి ట్రైన్ ఉండడంతో మా లగేజీలను అందుకు సిద్ధం చేసుకున్నాం. ఆరో తేదీ ఉదయం నాగపూర్ స్టేషన్లో ట్రైన్ ఎక్కాం. ట్రైన్‌లో మా యాత్ర గురించిన విశేషాలు అన్నీ మాట్లాడుకుంటూ ఉండగానే మధ్యాహ్నం రెండున్నర గంటలకు విజయ వాడ చేరాం. అంతకుముందే వరంగల్‌లో మాతోపాటు వచ్చిన వారిలో ఇద్దరు ధమ్మమిత్రులు దిగిపోయారు. మిగిలిన మేమంతా విజయవాడ రైల్వేస్టేషన్లో దిగి పరస్ప రం  వీడ్కోలు చెప్పుకుని విజయవంతంగా ధమ్మయాత్రని ముగించాం.

-------------------------------------------

# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర



-బెందాళం కృష్ణారావు

శ్రీకాకుళం నుంచి ఒంగోలు వెళ్తున్న ఆర్టీసీ బస్సు 2015 ఫిబ్రవరి 27వ తేదీన సాయంత్రం ఏడు గంటలకు మొదలైన నా ప్రయాణం తర్వాత రోజు ఉదయం ఐదున్నర గంటలకు విజయవాడ చేరుకునేసరికి తొలి రోజు ధమ్మయాత్రకు సిద్ధమైంది. మంగళగిరి బుద్ధ విహార ఆధ్వర్యంలో ఆరవ ధమ్మయాత్ర కోసం ధమ్మ మిత్రులమంతా ఫిబ్రవరి 28వ తేదీ ఉదయం ఎనిమిదిన్నర గంటలకు విజయవాడ రైల్వేస్టేషన్‌లో కలుసుకున్నాం. పరస్పర పరిచయాలు అయ్యాక కొంత సమయం తర్వాత పదిన్నర గంటలకు వచ్చిన ట్రైన్‌లో ఔరంగాబాద్ బయలుదేరాం. మరుసటిరోజు ఔరంగాబాద్ రైల్వేస్టేషన్‌లో ట్రైన్‌దిగి ఎల్లోరాలో బసచేసి ఎల్లోరా గుహలు, ఔరంగాబాద్ సందర్శనం మా తొలి రోజు యాత్రలో మేము ముందుగా సిద్ధం చేసుకున్న ప్రణాళిక, అయితే కొన్ని అనివార్యకారణాల వలన కొంచెం మార్పులు తప్పలేదు.

పద్దెనిమిది మంది ధమ్మ మిత్రులం ఉన్న ఈ బృందంలో విజయవాడ నుంచి పదహారు మందిమి మాత్రమే ట్రైన్ ఎక్కాము. మిగిలిన ఇద్దరు ధమ్మ మిత్రులు వరంగల్‌లో మాతో కలిసారు. మా బృందానికి బుద్ధభూమి మాసపత్రిక పబ్లిషర్ రేకా కృష్ణార్జునబోధి గారు, మంగళగిరి బుద్ధవిహార కార్యదర్శి పామర్తి రవి గారు నేతృత్వం వహించారు. రైలు ప్రయాణం తొలిరోజు ఎంతో ఆహ్లాదకరంగా జరిగింది. మాతోపాటు తీసుకొచ్చిన పులిహోర, ఫ్రైడ్‌రైస్, పెరుగన్నం తదితర ఆహార పదార్థాలు ఎంతో రుచికరంగా ఉన్నాయి. రైల్లో ఎటువంటి ఆహారపదార్థాలు కొనుక్కుని తినకూడదని ముందుగానే నియమం పెట్టుకోవడంతో అందరం ఆరోగ్యంగా ఉండగలిగాం.

మార్చి 1వ తేదీ ఉదయం ఐదు గంటలకు ఔరంగాబాద్ రైల్వేస్టేషన్‌లో ట్రైన్ దిగాం. స్టేషన్ నుంచి బయటకు వచ్చేసరికి ముందుగానే ఏర్పాటు చేసుకున్న మినీ బస్ మాకోసం సిద్ధంగా ఉంది. చిరుజల్లులు పడుతున్నాయి. రైల్లో వస్తున్నపుడే అజంతా, ఎల్లోరాకు సంబంధించిన పుస్తకాలను పరిశీలనగా చదవడంతో సోమవారం నాడు అజంతా గుహల సందర్శనకు సెలవు ఉంటుందని తెలిసింది. ఎల్లోరాలో బసచేసి తొలిరోజు ఆదివారం ఎల్లోరా గుహలు సందర్శించి తర్వాత రోజు సోమవారం అజంతా గుహల సందర్శనకు వెళ్లాలన్నది మా తొలి ప్రణాళిక, అయితే సోమవారం అజంతా గుహల సందర్శన వీలుపడదని తెలిసినతర్వాత పర్యటనలో స్వల్పమార్పులు చేసుకున్నాం. ఆదివారమే అజంతా వెళ్లాలని నిర్ణయించుకున్నాం. ఇలా చేయడం వల్ల ప్రయాణం దూరం రెట్టింపు కావడంతోపాటు వ్యయం కూడా అధికం అయ్యింది. అయినా అది మాకు కష్టం, భారం అనిపించలేదు. ఎందుకంటే మా యాత్రలో అజంతా గుహలు చూడటం అనేది చాలా ముఖ్యమైనది కాబట్టి.

రైల్వేస్టేషన్ నుంచి బస్సులో మా బస ఏర్పాటు చేసిన ఆశ్రమ అతిథిగృహానికి చేరుకున్నాం.



అక్కడే కాలకృత్యాలు తీర్చుకున్నాం. అల్పాహారం, మధ్యాహ్నభోజనాన్ని అక్కడే తయారు చేసుకుని మాతో బస్సులో తీసుకువెళ్లాలని నిర్ణయించుకున్నాం. అయితే సుమారు వంద కిలోమీటర్ల దూరం ప్రయాణించాల్సి వస్తుండడంతో సమయం సరిపోదని భావించి ఆ ప్రయాత్నాన్ని విరమించాం. అజంతా బయలు దేరాం. మా బసచేసిన అతిథి గృహానికి దగ్గరలోనే ఉన్న గరికపాటి వారి హోటల్‌లో రుచికరమైన ఆంధ్రా అల్పాహారాన్ని చేశాం.

ఎల్లోరా నుంచి అజంతా వరకూ సుమారు రెండున్నర గంటల పాటు జరిగిన బస్సు ప్రయాణంలో అజంతా విశేషాల గురించి బస్సులో ఉన్న మైక్ ద్వారా కృష్ణార్జునబోధి గారు, నెల్లూరు జిల్లా ఉదయగిరి నుంచి వచ్చిన లియాఖత్ ఆలీగారు మాట్లాడారు. మంగళగిరికి చెందిన చిలకా వెంకటేశ్వరరావుగారు పాటలు పాడారు. నేను అజంతా గుహల ప్రత్యేకత గురించి వివరించాను. సుమారు వెయ్యి సంవత్సరాలపాటు పశ్చిమ పర్వతశ్రేణిలో గల దట్టమైన అరణ్యంలో ఈ గుహలు కప్పబడిపోయాయి. 1819లో ఇవి యాదృచ్ఛికంగా బయటపడ్డాయి.

మా బస్సు అజంతా చేరుకునేసరికి మధ్యాహ్నం ఒంటిగంట అయ్యింది. మాతో పాటు తీసుకువెళ్లిన అల్పాహారాన్ని తిని అక్కడే మా బస్సును పార్కింగ్ స్థలంలో విడిచి పెట్టేశాం. అక్కడ నుంచి అజంతా గుహల వరకూ వెళ్ళే ప్రత్యేక బస్సును ఎక్కాం. ఔరంగాబాద్ నుంచి అజంతా వరకూ వర్షం చిరుజల్లుల రూపంలో మమ్మల్ని వెంటాడుతూనే ఉంది. అజంతా గుహలను చేరుకునేసరికి కూడా వర్షం పడుతూనే ఉంది. ఆ వర్షంలో దూరంగా సుమారు 250 అడుగుల ఎత్తులో గుర్రపునాడా ఆకారంలోగల కొండ చరియ మొత్తం అంతా కలిపి ఒకటే రాయిగా కన్పిస్తోంది. అందులోనే అజంతా గుహలున్నాయి. వీటిలో అతి ప్రాచీనమైనవి కూడా ఉన్నాయి. క్రీస్తు పూర్వపు కాలానికి చెందిన గుహలు కూడా కొన్ని ఉన్నాయి. మొత్తం ముప్పై గుహలు అందులో ఉన్నాయి. సాయంత్రంలోగా అన్ని గుహలనూ చూడగలమా అన్న సందేహం మమ్మల్ని వెంటాడింది. ఆ ముప్పై గుహల్లో అన్నీ చూడాల్సినవి కాదని, కొన్ని అసంపూర్ణ గుహలు కూడా ఉన్నాయని వాటిని విడిచిపెట్టి శిల్ప, చిత్రకళతో అలరారే ముఖ్యమైన గుహలు చూస్తే సరిపోతుందని అనుకున్నాము.

పురావస్తు శాఖ వారు ఏర్పాటు చేసిన కౌంటర్‌లో టిక్కెట్లు తీసుకుని లోపలకు అడుగు పెట్టాము. ఫోటోలు, వీడియో చిత్రీకరణకు ఆంక్షలు లేవని అయితే ఫ్లాష్‌ను మాత్రం ఉపయోగించ కూడదని సెక్యూరిటీ సిబ్బంది మాకు ముందుగానే హెచ్చరించారు. మా బృందంలోని కెమెరామాన్ మిత్రుడు నందం నరసింహారావు తదనుగుణమైన ఏర్పాట్లతో సిద్ధంగా ఉన్నారు. అన్ని గుహలకు మెట్లు ఉన్నాయి. అయితే అంచుల్లో నడవకూడదని, నిల్చోకూడదని హెచ్చరిక బోర్డులు కూడా ఏర్పాటుచేసి ఉన్నారు. అజంతా గుహల గురించి

వివరిస్తూ భారత పురావస్తు శాఖ ఏర్పాటు చేసిన మాప్‌లు, గుహల చిత్రాల వివరాల బోర్డులు కూడా ఉన్నాయి. చిరుజల్లుల్లో తడుస్తూనే లోపలకు అడుగు పెట్టాము. అక్కడ రాసిఉన్న వివరాలను బట్టి పదహారు గుహల్లో కుడ్య చిత్రాలున్నాయి. మిగిలిన చక్కని పనితనాన్ని 1,2,16,17,29 నెంబర్లుతో ఉన్న గుహల్లో చూడవచ్చని రాసారు. 9,10,19,26,29 నెంబర్ల గుహలు చైత్య మండపాలు, మిగిలినవన్నీ విహారాలు, వీటి ప్రాచీనతను పరిశీలిస్తే భారతదేశంలో బౌద్ధంలో వచ్చిన వివిధదశలను ప్రతిబింబిస్తున్నాయని రాసి ఉంది. అక్కడే ఉన్న పురావస్తు శాఖ ప్రచురణల విభాగం సాయంత్రం ఐదు గంటల తర్వాత మూసివేస్తారని తెలుసుకుని ఆ సమయంలోగా అంతా చూసిరావాలనుకున్నాం నేనూ, ఆలీగారూ, సెక్యూరిటీ చెకింగ్ అయ్యాక ధమ్మ మిత్రులమంతా ఒకటో నంబర్ గుహవైపు నడిచాం.

అజంతాలో మొదటి గుహకు చేరుకునేసరికి వర్షం పడుతూనే ఉంది. అజంతాలోని మొదటి గుహ విహార వాస్తు శిల్పకళకు అతిసునిశితమైన ప్రతీకగా కన్పించింది. దీని ముందు భాగం నగిషీ చెక్కడాలతో అత్యంత రమణీయంగా ఉంది. అతి సుందరంగా మలిచిన ఆరు స్తంభాలు వరండాలో అందంగా కన్పిస్తున్నాయి. ఈ స్తంభాల దూలాలు అనురేఖన (ట్రేసరీ) కళతోనూ, స్తంభాల పైభాగాన ఎగురుతున్న భంగిమల్లో విగ్రహాలను చెక్కారు. చక్కటి నగిషీ పనితనం గల ఈ వరండా ద్వారానే మొదటి గుహలోకి వెళ్లాము. చెప్పులను బయటే విడిచిపెట్టి అందరం గుహలోపలికి నడిచాం. లోపలే గైడ్‌ను కూడా ఏర్పాటు చేసుకున్నాం. గైడ్ హిందీలో చెబుతూ ఉంటే ధమ్మ మిత్రులు లియాఖత్ అలీగారు దానిని తెలుగులోకి అనువదించి చెప్పారు.

ఈగుహ సుమారు 64 చదరపు అడుగుల వీస్తీర్ణంతో ఒక మందిరంలోని హాలువలే విశాలంగా ఉంది. వరండాలో ఉన్న స్తంభాలకున్నట్లే దీనికీ అలంకృత శిల్పాలున్నాయి. ఈ హాలులో కూడా వెనుకవరుసలోని మధ్య రెండు స్తంభాలు అత్యంత అందంగా ఉన్నాయి. ఈ హాలులో ఇరువైపులా వరుసగా కొట్టాల వంటి గదులున్నాయి. ఇందులో ముందుగది



తర్వాత ముఖద్వారానికి ఎదురుగా ఒక పెద్ద బుద్ధవిగ్రహం ఉంది. దాని పక్కనే ఆయన ప్రథమ శిష్యులైన పంచవర్గీయ భిక్షువుల విగ్రహాలున్నాయి. వాటితో పాటు బుద్ధుని బోధనలు వినడానికి వచ్చిన సాధారణ ప్రజల విగ్రహాలు కూడా ఉన్నాయి. హాలులో కుడివరుసలోని మధ్యస్తంభంపై ఒక విచిత్ర ఆకృతి పలు భంగిమల్లో ఉండి వాటన్నింటికీ ఒకే తల ఉంది. అది ప్రతి లేడికీ విడివిడిగా తల ఉన్నట్లు కన్పిస్తుండడమే ఇందులో ప్రత్యేకత. ఇక్కడ గోడలూ పైకప్పూ ఒకప్పుడు రంగువేసినట్లు కన్పిస్తున్నా చాలా వరకూ అది ఊడిపోయింది. పైకప్పు రంగులలో చాలా చిత్రాలు ఊడిపోయాయి. అయితే ఇప్పటికీ మిగిలున్న చిత్రాలు కొన్ని అత్యుత్తమంగా కన్పిస్తున్నాయి.

ఈ చిత్రాల్లో చాలా వరకూ జాతక కథల సన్నివేశాలున్నాయి. ముఖ్య ద్వారానికి ఎడమవైపున శిబి జాతక కథగా గమనించవచ్చు. ఒక గ్రద్దకు ఆహారం కానున్న పావురం బోధిసత్వుడైన శిబిరాని శరణు జొచ్చింది. ఆ పావురాన్ని వెంబడిస్తూ వచ్చిన గ్రద్ద తాను వేటాడిన పావురాన్ని తనకు విచిపెట్టాలని శిబిరాజును కోరింది. దానికి బదులుగా శిబిరాజు పావురం బరువుకు సరిపోయే మాంసాన్ని తన శరీరం నుంచి గ్రద్ధకు ఇచ్చాడు. ఈ సన్నివేశాన్ని రాజు ఒడిలో కూర్చొన్న పావురంగా ఆనాటి చిత్రకారులు ఇందులో చిత్రించారు.

ముందు గదిలోని పక్కగోడలపై బుద్ధుని జీవితంలో ప్రధాన సంఘటనలను ప్రముఖంగా చిత్రించారు. ఈ చిత్రాల్లో ఎడమవైపు ఉన్న దాంట్లో ఏడేళ్ల అన్వేషణ తర్వాత గౌతముడు జ్ఞానసిద్ధి పొందుతున్న ఘడియను చిత్రీకరించారు. జ్ఞానాన్వేషణకై అంతఃపురాన్ని విడిచి సన్యాస జీవితాన్ని ఆరంభించిన నాటి నుంచీ దుష్టుడైన మారుడు అతనిని వెంటాడుతూనే ఉంటాడు. "నీ సామ్రాజ్యపు పరిపాలనా చక్రం తిరిగి నీదౌతుంది. సన్యాసాన్ని విడిచిపెట్టు" అని ప్రలోభానికి గురిచేస్తుంటాడు. అయినా సరే సిద్ధార్థుడు చలించకుండా తన లక్ష్యసాధనకు ముందుకు సాగుతాడు.

గౌతముడ్ని మరింత భయపెట్టాలనే సంకల్పంతో మారుడు "నీ మనసులోకి ఎప్పుడు ఎలాంటి దురాలోచన వచ్చినా నాకు తెలిసిపోతుంది జాగ్రత్త" అంటూ హెచ్చరిస్తాడు. అయినా గౌతముడు మారుడిని ఏమాత్రం లక్ష్యపెట్టకుండా తన మార్గంలో ముందుకు సాగుతాడు. ఏడేళ్లపాటు మారుడు గౌతముడ్ని నీడలా వెంటాడుతూనే ఉంటాడు. గౌతమునికి జ్ఞానోదయం కలిగే క్షణం ఆసన్నమైనప్పుడు మారుడు భయంతో కంగారుపడి తన చివరి ప్రయత్నం



చేస్తాడు. బుద్ధుని జ్ఞానసాధనను భగ్నం చేయాలని తన స్వంత కూతుళ్లనే పంపిస్తాడు. ఈ ఇతివృత్తాన్ని చిత్రాల రూపంలో ఆనాటి చిత్రకారులు అతి రమణీయంగా చిత్రించారు. కుడి వైపు గోడమీద మరో చిత్రం కనిపిస్తుంది. ఈ చిత్రం పేరు 'శ్రావస్థిలోని అద్భుతం'గా చెబుతారు. ఈ చిత్రంలో బుద్ధుడు అనేక భంగిమల్లో గల బుద్ధునిగా వందల సంఖ్యలో కనిపిస్తాడు.



ముందుగదికి కుడి ఎడమ పక్కల్లో ఉన్న వెనుక వరండా గోడపై రెండు బృహత్ బోధిసత్వుల చిత్రాలు కన్పిస్తాయి. ఇవి అజంతాలోని ప్రముఖ కళాఖండాలు. అంతర్జాతీయంగా కూడా ఇవి గుర్తింపు పొందాయి. ఎడమవైపున పద్మపాణి బోధిసత్వుని చిత్రం ఉంది. తపోభంగిమలో అర్ధనిమీలిత నేత్రాలతో, ముఖంలో తొణికిసలాడే అలౌకిక ఆధ్యాత్మిక శాంతితో సకల జీవరాసుల పట్ల గల దయకు ప్రతీకగా కన్పిస్తుందీ చిత్రం. ఈ గొప్పచిత్రం ప్రపంచవ్యాప్తంగా ఎంతో మంది చిత్రకళా అభిమానుల, విమర్శకుల ప్రశంసలు పొందింది.

బోధిసత్వుని పక్కన అతని భార్య, అజంతా శిల్పకళాకృతుల్లో తరచూ కన్పించే నీలసుందరి, ఎడమవైపు భాగంలో దేవతల విగ్రహాలు, కుడివైపున ఆనందంతో కేరింతలు కొడుతున్న కోతులూ నెమళ్లను చిత్రీకరించారు. రెండవ బోధిసత్వుని చిత్రాన్ని వజ్రపాణి అంటారని గైడ్ చెప్పాడు. సర్వాలంకారాలతో ప్రకాశిస్తున్న ఈ బోధిసత్వుడు ఒక సేవకునిపై విలాసంగా వయ్యారంగా ఆనుకుని ఉంటాడు.

ఒక రాజు అతనికి పూవులు అందిస్తున్నట్లుగా చిత్రంలో ఉంది. దిగువవైపు ఇద్దరు నల్లని రంగులో ఉన్న స్త్రీలుంటారు. ఈ చిత్రం చాలా వరకూ ఊడిపోయింది. కానీ ఇందులో అభివర్ణితమైన చిత్రాల నాజూకు తనం, లావణ్యం ఇంకా అందరినీ అకట్టుకుంటూనే ఉన్నాయి. గైడ్ సహకారంతో ఈ విశేషాలన్నీ తెలుసుకున్నాం. ధమ్మమిత్రుడు నరసింహారావు మమ్మల్నీ, గుహలో ఉన్న శిల్పాలనీ, చిత్రాలనూ స్టిల్‌కేమెరాతో ఛాయాచిత్రాలుగా, వీడియో కెమెరాతో దృశ్యాలుగా చిత్రీకరించారు. గైడ్‌కు ధన్యవాదాలు చెప్పి కొంత పారితోషికం ఇచ్చి మొదటి గుహ నుంచి బయటకు వచ్చాము రెండో నంబర్ గుహవైపు అడుగులేశామంతా, వర్షం మాత్రం ఇంకా మమ్మల్ని వెంటాడుతూనే ఉంది.

రెండో నంబర్ గుహ కూడా చాలా వరకూ ఒకటో నెంబర్ గుహనే పోలిఉంది. వరండా పైకప్పులో అందమైన శిల్పాలు మాకు కనువిందుచేసాయి. అక్కడి కుడ్యచిత్రాలు అద్భుతంగా ఉన్నాయి. ఈమండపంలోని ఎడమవైపు గోడపై బుద్ధుని జీవితగాథలను, జన్మసంఘటనలను వివిధ పలకాలపై రకరకాలుగా చిత్రించారు. గది తలుపునకు పైన గల ఫలకంపై బోధిసత్వుడు స్వర్గంలో కన్పిస్తాడు. భూమిపైన జన్మ, పునర్జన్మల చక్రాన్ని దాటిన బోధిసత్వుడు ఆఖరుసారిగా జన్మనెత్తి తన అంతిమ గమ్యస్థానం చేరుకున్నట్లుగా చిత్రీక

రించారు. దిగువ ఎడమ వైపున గల ఫలకంపై మాయాదేవికి వచ్చిన చిత్రమైన కలను కళాత్మకంగా చిత్రించారు. బుద్ధుని జననానికి ముందు ఆమె తన పడకగదిలో నిద్రిస్తున్న సమయంలో ఆరు దంతాలతో ఉన్న ఒక తెల్లని ఏనుగు ఆమె శరీరంలోకి ప్రవేశించినట్లు కల వస్తుంది. ఆమె అదేవిషయాన్ని తన భర్త శుద్ధోధనునితో చెబుతున్న సన్నివేశాన్ని పై వైపున గల ఆఖరు ఫలకంపై చిత్రీకరించారు... రాజు సభలోని పురోహితులను పిలిపించి తన భార్య మాయాదేవికి వచ్చిన స్వప్నం చెప్పి దాని పర్యవసానం ఏమిటని అడుగుతున్న సన్నివేశాన్ని కుడివైపున గల ఫలకంపై చిత్రంగా ఆనాటి చిత్రకారులు రూపొందించారు.

ఈ గుహలో ముందరి వరండా కుడి గోడపై చాలా వరకూ శిధిలమై ఉన్న ఒక చిత్రం ఉంది. ఇది కూడా అజంతాకు సంబంధించిన అత్యుత్తమ కళాఖండంగా గుర్తింపు పొందింది. ఇందులో విశేషం ఏమంటే ఖడ్గాన్ని ధరించిన ఒక రాజు ఒక స్త్రీని శిక్షిస్తున్నట్లుగా చిత్రించారు. ఆ స్త్రీ మోకరిల్లి దయాభిక్ష కలిగించాలని వేడుకుంటూ ఉంటుంది. ఈ చిత్రంలో ఆమె ముఖం దుఃఖ పూరితమై ఉంటుంది. సన్నని నాజూకైన శరీరంతో ఉన్న ఆమె అపురూప లావణ్యంతో చిత్రంలో కన్పిస్తోంది. ఈ చిత్రం విస్తారంగా ఉంటుంది. ఇందులో అనేక రకాల వస్త్రాలు నలిగిపోయి నేలమీద కుప్పలుగా కన్పిస్తాయి. ఈ చిత్రంలో అభివర్ణితమైన హావభావాలు రమణీయంగా తీర్చిదిద్దారు. ముందుగదికి రెండు పక్కలా ఉన్న ఆలయాల్లో చక్కని కుడ్య చిత్రాలున్నాయి. కుడి పక్కన గల చిత్రాల్లో స్త్రీ మూర్తుల చిత్రణ అద్భుతంగా ఉంది. ముందుగది, ఆలయంలోగల చిత్రాలు నిరుపమానమైనవి. పైకప్పున ఉన్న చిత్రాల్లో ఒకదానివెనుక మరొకటి మొత్తం ఇరవైమూడు హంసలు వరుసగా బారులు తీరి వెళ్తున్నట్లు అపూర్వంగా చిత్రించారు. మూడో నంబర్ గుహలో పెద్ద విశేషాలు ఏమీ లేవని గైడ్ చెప్పడంతో అంతా నాలుగో గుహవైపు నడిచాము.

**(ఇంకాఉంది)**

*-రచయిత సెల్ : 73968 66888*

## ఆఫ్ఘాన్‌లో 3డి బుద్ధుడు



ఆఫ్ఘానిస్తాన్‌లో 14 ఏళ్ళక్రితం తాలిబాన్లు ధ్వంసం చేసిన ప్రపంచ ప్రఖ్యాత బమియాన్ బుద్ధుని విగ్రహాలు మళ్ళీ కనువిందు చేస్తున్నాయి. హజారజాత్ ప్రాంతం లోని బమియాన్ లోయ ప్రాంతంలో ఆరో శతాబ్ద కాలంలో కొండను తొలచి చెక్కిన 115 అడుగుల వెడల్పు, 174 అడుగుల ఎత్తు ఉన్న రెండు భారీ విగ్రహాలను 2001వ సంవత్సరంలో డైనమేట్‌లతో తాలిబాన్లు ధ్వంసం చేయడం తెలిసిందే. గతంలో విగ్రహాలున్న స్థలంలోనే 3డీ లేజర్ లైట్ ప్రొజెక్షన్ టెక్నాలజీ సాయంతో చైనాకు చెందిన ఓ జంట ఈ విగ్రహాలను సాక్షాత్కరింపజేసింది. ఆఫ్ఘాన్ ప్రభుత్వం, యునెస్కో సంస్థల అనుమతులు పొందిన అనంతరం జూన్ 7న ఈ పనికి శ్రీకారం చుట్టామని జాన్సన్ యు.లియన్ హులు తెలిపారు.

(15-6-2015 సాక్షి దినపత్రిక సౌజన్యంతో..)



మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో 2015 ఫిబ్రవరి 28 నుండి మార్చి 8 వరకు
జరిగిన 6వ ధమ్మయాత్ర సందర్భంగా మహారాష్ట్రలోని అజంతా గుహల వద్ద
బుద్ధవిహార సభ్యులు మరియు అభిమానులు (వివరాలు 29వ పేజీలో)



# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర



-బెందాళం కృష్ణారావు

(గత సంచిక తరువాయి-2)

అజంతాలోని నాలుగో గుహ అతిపెద్ద విహారంగా ఉంది. విస్తృతంగా అలంకృతమైన ముఖద్వారం గుండా ఈ గుహలోకి వెళ్లాము. ఇది దాటగానే ఇరవై ఎనిమిది స్తంభాలు గలిగిన ఒక పెద్ద మండపం వచ్చింది. తలుపునకు కుడివైపున అష్టభయాలనుంచి విముక్తికై ప్రార్థిస్తున్న భక్తుల మధ్య బోధిసత్వుడు కనిపించాడు. ఈ మండపం మూలల్లో, తలుపుల మధ్యలో ఎన్నో వివరణాత్మకమైన శిల్పాలు కనువిందు చేశాయి. ఈ శిల్పాలలో మదపుటేనుగ బారి నుండి పరుగులు తీస్తున్న స్త్రీ, పురుషులు, చెట్టుని ఆనుకుని ఉన్న ఒక యువతి ఉడుతతో ఆడుకోవడం, ఒక మహిళ మాయలో చిక్కుకుని జాలిగా చూస్తున్న పురుషుడు వంటి వాటిని సునిశితమైన పనితనంతో బాగా మలిచారు.

అక్కడినుంచి ఐదో గుహలోకి కొన్ని మెట్లు ఎక్కాక ముఖద్వారానికి సాలభంజికల విగ్రహాలున్నాయి. ఆరో గుహ రెండు అంతస్తులున్న ఏకైక విహారంగా కన్పించింది. రకరకాల భంగిమల్లో ఉన్న బుద్ధుని విగ్రహాలు ఆకట్టుకున్నాయి. ఏడు, ఎనిమిది నెంబర్ల గుహల్లో పెద్ద ప్రత్యేకత ఏమీలేదు. అందరం తొమ్మిదో నెంబరు గుహవైపు కదిలాము.

ఇది ఒక చైత్య మంటపం. ఇది క్రీస్తు పూర్వం ఒకటో శతాబ్దం నాటిదని గైడ్ చెప్పాడు. ప్రజల దైనందిన జీవితాన్ని ప్రతిబింబించే కుడ్య చిత్రాలను చూశాం. పశువుల కాపరులు తమ ఆలమందలను కాసుకుంటున్న చిత్రం. నిరాడంబరంగా ఉన్న బుద్ధుని విగ్రహాలు, స్తంభాలపైనా, వెనుక గోడలపైనా, గవాక్షాలపైనా ఉన్న చిత్రాలు ఆనాటి థేరవాద (హీన యానం) బౌద్ధానికి, ఆ తర్వాత వచ్చిన వైవిధ్యతకు నిదర్శనాలుగా కన్పించాయి. పదో గుహ కూడా తొమ్మిదో గుహలాగే ఉంది. అయితే ఇది దానికన్నా పెద్దదిగా ఉంది. దీని ముందు భాగంలో రాసిన వివరణలను బట్టి ఇది క్రీస్తు పూర్వం రెండో శతాబ్దానికి చెందినదని తెలుస్తోంది. ఇది చైత్యాలన్నింటిలోకి ప్రాచీనమైనదిగా కన్పించింది. ప్రాచీన భారత చిత్రకళకు ప్రతిబింబాలుగా ఉన్న ఈ చిత్రాలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. ఇందులో మూడో స్తంభానికి ఎదురుగా ఉన్న గోడపైన ఒక రాజ వంశస్థుడు సైనిక, నృత్య గాయక బృందంతో దర్శనమిస్తాడు. ఆనాటి వారి దుస్తులు, నగలు, కేశాలంకరణ వంటివి విభిన్నంగా కన్పిస్తూ ఆసక్తిని పెంచాయి.

పదకొండో గుహలో కొన్ని చిత్రాలు మాత్రమే ఉన్నాయి. పన్నెండో గుహలో థేరవాద బౌద్ధ విహారం ఉంది. ఈ గుహకు మూడు పక్కలా బౌద్ధ భిక్షువుల నివాస స్థానాలు వాటిలో రాతితో చేసిన పడకలనూ చూశాము. తర్వాత రెండు గుహలు అంత ప్రాముఖ్యత లేనివని తెలిసి పదహారో గుహలోకి వెళ్లాము. కొంచెం దిగువకు రాతి మెట్లు గుండా నడిచి వెళ్లాము. ఈ గుహ ముఖ్య ద్వారానికి ఇరువైపులా చెక్కబడిన ఏనుగుల విగ్రహాలున్నాయి. ఇక్కడి నుంచి నదిని చేరడానికి మెట్ల వరుస దిగువన ఉంది కానీ, అది శిథిలమైపోయి ఉంది. ఈ



గుహాలయాలన్నింటిలోనూ ఇది అత్యంత రమణీయంగా ఉంది. వాస్తు శిల్ప కళావైభవం అపురూపంగా అలరారుతోంది. క్రీస్తు శకం ఆరో శతాబ్దంలో దీనిని నిర్మించినట్లు ఈ గుహాముందున్న ఫలకం తెలియజేస్తోంది. ఇందులో కూడా అపురూపమైన శిల్పాలు, చిత్రాలు బుద్ధుని జీవితగాథలను మాకు పరిచయం చేసాయి. ఈ గుహలో అతి సుందరమైన చిత్రం ఒకటుంది. దానిని అంతర్జాతీయ చిత్రకళా విమర్శకులు "ది డైయింగ్ ప్రిన్సెస్"(మరణిస్తున్న రాకుమారి)గా వ్యవహరిస్తున్నారు. విషాదానికి సజీవ రూపంగా ఈ చిత్రాన్ని చిత్రించారు.

పదిహేడో గుహ కూడా పదహారో గుహలాగే కన్పించింది. అయితే దీనికి అదనంగా ఒక ముందర గది కూడా ఉండడం ఓ ప్రత్యేకత. నగిషీలతో ఉన్న ఫలకాలతో ముఖద్వారాన్ని అలంకరించారు. లోపల ఉన్న చిత్రాలు అత్యద్భుతమైనవి. కాల పరీక్షకు నిలిచినవి చాలా ఉన్నాయి. వీటిలో బుద్ధుని జీవిత విశేషాలను, జాతక కథలలోని సన్నివేశాలను వివరించేవి అత్యధికంగా ఉన్నాయి. సింహళరాజు విజయాన్ని చిత్రించే చిత్రాలు కూడా ఎంతో రమణీయంగా కన్పించాయి.

పద్దెనిమిదో గుహలో ఏమీ లేవని తెలిశాక పంతొమ్మిదో గుహలోకి వెళ్ళాము. ఇది ఒక చైత్య మంటపం. ఇందులో చిత్రాలకన్నా బుద్ధుని శిల్పాలే వివిధ భంగిమల్లో అత్యధికంగా ఉన్నాయి.

ఇరవయ్యో గుహ కూడా వాస్తు శిల్పకళకు చక్కని నిదర్శనంలా కన్పించింది. ఆ తర్వాత ఇరవై ఒకటి నుంచీ ఇరవై ఐదో గుహ వరకూ అంత ఆసక్తికరంగా కన్పించలేదు. కారణం ఇవి అసంపూర్తిగా ఉండడమే. ఇరవయ్యారో గుహ అజంతాలో చివరిదీ, అత్యంత ఉత్కృష్ట మైనదీ. ఇందులో శిల్పాల సంఖ్య చాలా ఎక్కువగా కన్పించాయి. ఈ గుహలోనే బుద్ధుని మహా పరినిర్యాణంను అత్యంత ప్రతిభావంతమైన శిల్పాలుగా మలిచారు. అజంతా కొండ రాళ్లపై ఎలా శిల్పాలను తొలిచారో సూచించడానికి తగిన ఔట్‌లైన్ శిల్పరచన కూడా ఇందులో ఒకచోట ఆనాటి శిల్పులు చూపించారు. రాతి పై భాగంపై గీతలు గీసి వాటి అంచనా మేరకు శిల్పాలను చెక్కినట్లు స్పష్టమైంది మాకు.

అజంతా గుహల సందర్శనలో అవసరమైన చోటల్లా ఫొటోలు, వీడియోలు దిగాం. అక్కడే గుహల ప్రారంభంలో ఉన్న పురావస్తుశాఖ విక్రయ కేంద్రంలో లియాఖత్ ఆలీగారూ, నేనూ కొన్ని విలువైన పుస్తకాలు కొనుగోలు చేశాం. ఇంతలో బస్సు రాగా తిరుగు ప్రయాణమయ్యాం. అజంతాలో ఎవరికి వారు వారి అనుభూతులను కృష్ణార్జునబోధి గారితో సహా, మిత్రులమంతా బస్సులో ఏర్పాటు చేసిన మైక్ ద్వారా ముచ్చటించుకున్నాం. మేము

బస చేసిన చోటుకు బస్సు తిరిగి చేరుకునేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది. ఆ సమయంలో కూడా మిత్రుడు రేకా శ్రీనివాసరావు మాకు ఆకలి బాధ లేకుండా చేయడానికి వంటకు ఉపక్రమించాడు. ఈలోపు మేమంతా స్నానాలు ముగించుకుని వచ్చి వంటపనిలో తలా ఒక చేయి వేసి దాన్ని త్వరగా పూర్తి చేశాము. ఆ సమయంలో కూడా మాకు రుచికరమైన భోజనాన్ని వండిపెట్టిన మిత్రుడు శ్రీనివాసరావుని అందరూ చాలా అభినందించారు. రాత్రి భోజనాన్ని ముగించి అజంతా తలపులతో తర్వాత రోజు ఎల్లోరా గుహలు చూడాలని ఇక నిద్రకు ఉపక్రమించాము.

### శిల్పసిరికి శ్రీనిధి ఎల్లోరా

మా ధమ్మ యాత్రలో ముందుగా ఎల్లోరా గుహలను సందర్శించాలని ప్రణాళిక వేసుకున్నా అనివార్య కారణాల వలన రెండోరోజు (మార్చి 2వ తేదీ)కి గానీ అది కుదరలేదు. అజంతా చిత్ర, శిల్పకళా సౌందర్యాన్ని కనులారా వీక్షించి మైమరిచిన మాకు ఎల్లోరా శిల్పాలను ఎప్పుడు చూస్తామా అన్న ఉత్సుకత తీరే సమయం వచ్చేసింది. మేము బస చేసిన చోటునుండి బస్సులో ఎల్లోరాకు వెళ్లడానికి వీలుపడదని ముందుగా గుర్తించిన నిర్వాహకులు పామర్తి రవి గారు నాలుగు ఆటోలను రప్పించారు. వాటిలో నాలుగు బృందాలుగా మేమంతా బయలుదేరాం.

ఔరంగాబాద్‌కు పద్దెనిమిది మైళ్ల దూరంలో ఉన్న ఈ ఎల్లోరా గుహలను సందర్శించాలంటే దౌలతాబాద్ కోట పక్కనుంచే వెళ్లాలి. మేము ఆటోల్లో వెళ్తూ మహమ్మద్ బీన్ తుగ్లక్ తన పాలనలో ఢిల్లీని రాజధానిగా కాదని దౌలతాబాద్‌ని కొత్త రాజధానిగా ఏర్పాటు చేయడం, అక్కడ ప్రతికూల పరిస్థితుల కారణంగా మళ్లీ రాజధానిని ఢిల్లీకి మార్చడం వంటి విశేషాలను గుర్తు చేసుకున్నాము. మేము కూర్చొన్న ఆటోలు ఎల్లోరాలోని పదహారో నెంబర్ గుహకు అభిముఖంగా ఉన్న టాక్సీ స్టాండ్‌లో ఆగాయి. అయితే ఎల్లోరా గుహల సందర్శన పదహారో నెంబరు గుహ నుంచి మొదలు పెట్టడం కన్నా అక్కడనుంచి దక్షిణ దిశగా నడుచుకుంటూ వెళ్లి ఒకటో నెంబరు గుహనుంచి ప్రారంభించడం మంచిదని ఎక్కడో చదివినందువల్ల అందరం అటువైపు అడుగులు వేశాము.

అంతకు ముందురోజు మేము చూసిన అజంతా గుహలన్నీ బౌద్ధమతంలో వివిధ దశలను ప్రతిబింబిస్తే అందుకు భిన్నంగా ఎల్లోరా గుహలన్నీ బౌద్ధ, జైన, వైదిక మతాల శిల్పకళకు



సంకేతాలుగా నిలుస్తున్నాయి. మొత్తం 34 గుహలు గల ఎల్లోరాలో 1నుండి 12వ గుహవరకూ బౌద్ధం, 13 నుంచి 29వ గుహ వరకూ వైదిక మతం, 30 నుండి 34 వరకూ జైన గుహలున్నాయి. మా ఆటోలు నిల్పిన స్థలానికి సమీపంలో ఉన్న పదహారో నెంబర్ గుహ వైదిక మతానికి చెందినది. ఈ గుహలన్నింటిలో బౌద్ధ గుహలు అన్నింటికన్నా ప్రాచీనమైనవని వీటిని క్రీస్తు శకం 500 నుంచి 700 మధ్య కాలంలో చెక్కి ఉంటారని అక్కడ ఉన్న భారత పురాతత్వ సర్వేక్షణ వారు ఏర్పాటు చేసిన ఫలకాలు తెలియజేస్తున్నాయి. ఈ గుహల్లో 5,10,15,16,21,32 నెంబర్లు గలవి అత్యంత ప్రముఖమైనవని తోటి సందర్శకులు చెప్పారు.

ధమ్మ మిత్రులమంతా ఒకటో నెంబర్ గుహలోకి అడుగు పెట్టాము. ఇది ఎల్లోరాలోని అత్యంత పురాతనమైన నిర్మాణం. ఇది సాధారణమైన ఎనిమిది గదుల విహారం. ఇందులో విశేషాలు మాకు ఏమీ కన్పించకపోయినా విశాలమైన ప్రాంగణం లోపల ఉంది. ఈ గుహంతా కలియతిరిగి రెండో నెంబర్ గుహలోకి వెళ్లాము. ఇది ఒక పెద్ద చైత్య మందిరం. దీని పై కప్పుకు కుషన్ స్తంభాగ్రాలతో ఉన్న అతి పెద్దవైన పన్నెండు స్తంభాలున్నాయి. సింహాసనంపై కూర్చొన్న అతి పెద్ద బుద్ధ విగ్రహం ఉంది. ఈ గుహలోనే పద్మాసనంలో ఉన్న బుద్ధుని విగ్రహాలు కూడా ఉన్నాయి. వీటితో పాటు అనేకమంది బోధిసత్వుల విగ్రహాలను కూడా ఆనాటి శిల్పులు రమణీయంగా మలిచారు.

మూడో నెంబరు గుహ దీనిని ఆనుకునే ఉంది. ధమ్మ మిత్రులమంతా ఆ గుహలోకి నడిచాము. ఇది దాదాపుగా అంతకు ముందు సందర్శించిన రెండో నెంబర్ గుహనే పోలి ఉంది. ఈ గుహ ప్రాంగణం చివరిలో ప్రార్థనా మందిరం ఉంది. ఇక్కడ పద్మాసనంలో ఆశీనుడైన బుద్ధుని పక్కనే పాము తలలు కలిగిన నాగశిల్పాలు కన్పించాయి మాకు. నాలుగో నెంబర్ గుహలో చూడాల్సిన విశేషాలేమీ లేవని తెలిసి ఐదో నెంబర్ గుహవైపు కదిలాము.

ఇప్పటివరకూ మేము చూసిన ఎల్లోరా గుహల్లో ఇది బాగా పెద్దదిగా మాకు కన్పించింది. ఈ గుహ 117×56 అడుగుల కొలతలు గల విహారం అని గుహముందు ఏర్పాటు చేసిన సూచిక ఫలకంలో భారత పురాతత్వ సర్వేక్షణ విభాగం పేర్కొన్న విషయాన్ని గమనించాము. ఇది విహారం మాత్రమే కాకుండా రెండు వైపులా ప్రత్యేకంగా గూడులు వంటి ప్రదేశాలున్నాయి. ఈ మందిరంలో ఇరవై నాలుగు స్తంభాలున్నాయి. లోపలి భాగాన్ని చూసిన మాకు ఇది అతిథి గృహంగానైనా లేకపోతే శిష్యులకు బోధనలు చేసే మందిరంగా నైనా ఉపయోగించి ఉంటారని అన్పించింది. ఇక్కడున్న ప్రార్థనా మందిరంలో కూడా పెద్దదైన బుద్ధుని విగ్రహం మా అందర్నీ ఆకట్టుకుంది.

ఆరో నెంబరు గుహలో చాలా ప్రత్యేకతలు కన్పించాయి. ఇది బౌద్ధ గుహ అయినప్పటికీ వీణాపాణి అయిన సరస్వతి విగ్రహం కూడా ఇక్కడ ఉండడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ గుహలో వివిధ బౌద్ధ జాతక కథలకు సంబంధించిన శిల్పాలు అందరికీ కనువిందు చేస్తున్నాయి.

ఏడు నుంచి తొమ్మిదో నెంబరు వరకూ ఉన్న గుహల్లో పెద్ద ప్రత్యేకతలు ఏమీ లేకపోవడంతో పదో నంబరు గుహ లోపలికి వెళ్లాము. ఇది ఎల్లోరా గుహల్లో సక్రమంగా తీర్చిదిద్దిన బౌద్ధ చైత్య మందిరంగా మేము గుర్తించాము. ఈ గుహ ముందు భాగాన్ని ఎక్కువగా నగిషీలు చెక్కి అలంకరించారు. అధునాతన తాపీపనితో దానిని రూపొందించారా అన్నట్లు ముందుభాగం కన్పించింది. ప్రార్థనా మందిరం లోపలి భాగాన పైన చుట్టూ గ్యాలరీలు

10



మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో 2015 ఫిబ్రవరి 28 నుండి మార్చి 8 వరకు
జరిగిన 6వ ధమ్మయాత్ర సందర్భంగా మహారాష్ట్రలోని ఎల్లోరా గుహల వద్ద
బుద్ధవిహార సభ్యులు మరియు అభిమానులు (వివరాలు 37వ పేజీలో)



# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర

-బెందాళం కృష్ణారావు



(గత సంచిక తరువాయి-3)

బౌద్ధమత గుహల సందర్శన పూర్తికావడంతో పక్కనే ఉన్న వైదిక మత గుహలను చూడడానికి బయలుదేరాము. ఇవి క్రీస్తుశకం 7-9 శతాబ్దాల మధ్యకాలంలో చెక్కారని అక్కడున్న సూచికలు తెలియజేస్తున్నాయి. అంతవరకూ మేము చూసిన గుహల్లో ఉన్న చైత్య మందిరాలు, విహారాలకు ఈ గుహలకూ ఏ మాత్రం పోలికే లేదు. బౌద్ధకళలాగే ఈ చెక్కడాలు మత సంబంధమైనవే అయినప్పటికీ వాటి వ్యక్తీకరణ మరో రూపంలో మాకు కన్పించింది.

ఎల్లోరాలోని 14వ గుహలోకి ధమ్మమిత్రులమంతా అడుగు పెట్టాము. ఇది వైదిక మతానికి పరిచయంలా రూపొందించారు. ఈ గుహలో ఎడమ వైపున మొదటి ఫలకంలో దుర్గ విగ్రహాన్ని చెక్కారు. మూడవ ఫలకంపై విష్ణువు విగ్రహం ఉంది. ఈ గుహాలయంలో లక్ష్మీ విగ్రహం కూడా మాకు కన్పించింది. కుడివైపు గోడమీద శివుడుతోపాటు అనేక రకాల దేవుళ్ళ విగ్రహాలను చెక్కారు. ఈ దేవుళ్లలో శివుని భార్య పార్వతి విగ్రహాన్ని కూడా రూపొందించారు.

దీని తర్వాత పదిహేనో గుహను చేరుకోవడానికి చాలా మెట్లు ఎక్కాల్సి వచ్చింది. పైకి వెళ్ళాక అందంగా చెక్కిన గేటు కన్పించింది. ఈ గుహకు రెండు అంతస్థులున్నాయి. మంటపంలో అనేక చిన్న చిన్న ఆలయాలు, పూజారులు నివసించే గదులున్నాయి. మొదటి ప్రాంగణంలో విశాలమైన మందిరం ఉంది. అయితే ఇందులో చూడడానికి ఏమీ లేదు. ఎగువ మందిరంలో రెండు గోడలలో గల సొరంగంలో ఎంతో చక్కగా మలచిన శిల్పాలు మాకు కన్పించాయి. ఈ శిల్పాలను సందర్శకులు పోల్చుకోవడానికి వీలుగా పురావస్తు శాఖ వారికి నేమ్ ప్లేట్లను ఏర్పాటు చేసింది. ఈ విగ్రహాల్లో ప్రధానంగా మాకు కన్పించినవి వివిధ రూపాల్లోని శివుని విగ్రహాలు, అష్టబాహువులతో యోధుని రూపంలో రాక్షసులతో యుద్ధం చేస్తున్న శివుడు, శివతాండవ దృశ్యం, పార్వతితో పాచికలు ఆడుతున్న శివుడు, లింగోద్భవుడైన శివుడు... ఇలా రకరకాల రూపాల్లో శివుని విగ్రహాలు అనేకం మాకు కన్పించాయి. ఈ గుహాలయంలో ఒక శివలింగం దానికి ఎదురుగా నంది ఉన్నాయి.

ఎల్లోరా గుహాలయాల్లో అత్యంత ఉత్కృష్టమైనది పదహారో నెంబరు గుహ. దీనిని కైలాసంగా అభివర్ణిస్తుంటారు. ప్రపంచంలోనే అద్భుతమైన ఏకశిలా నిర్మాణంగా ఇది గుర్తింపు పొందింది. అటువంటి గుహలో ధమ్మ మిత్రులమంతా అడుగుపెట్టాం. లోపలకు వెళ్ళగానే మానవ మహామేధస్సుకు, కళాసృజనకూ నిలువెత్తు నిదర్శనంలా అది మాకు కన్పించింది.

ఒక కొండలోని సుమారు 30 లక్షల ఘనపుటడుగుల రాతిని పూర్తిగా చెక్కి ఈ కైలాస శిల్పాలను రూపొందించారు. అనేక వందలమంది భవన నిర్మాణ నిపుణులు, శిల్పులు కలిసి ఈ మహాద్భుతాన్ని సృష్టించారనే విషయం చూడగానే మాకు స్పష్టమైంది. ఈ గుహాలయ

నిర్మాణ పనిని మొదట కొండ శిఖరాగ్రం నుంచి ప్రారంభించి ఉంటారని మేము భావించాము.

ఒక దీర్ఘచతురస్రాకారపు అగడ్తను రాతి లోతుల్లోకి తవ్వి ఉంటారని తెలుస్తోంది. సుమారు ముప్పై లక్షల ఘనపుటడుగుల రాతిని చెక్కి 107 అడుగుల లోతు, 154 అడుగుల వెడల్పు, 276 అడుగుల వైశాల్యంతో ముందుగా తవ్వి, ఆ తర్వాత మధ్యలో మిగిలిన రాతిని దశాబ్దాలపాటు చెక్కి బృహత్ శివాలయంగా మలిచారు. ఈ గోడలపైనా, లోపలా ఎన్నో అపారమైన నగిషీలను చెక్కి వాటికి అద్భుత నిర్మాణాన్ని జోడించారు. ఇందులో ఒక విశాలమైన ప్రాంగణం, అందులో మూడు భవంతుల్లాంటి ఆలయాలు వాటిని ఒకదానికొకటి సంధానించే విధంగా ఉపరితల వంతెనను కూడా ఏర్పాటు చేశారు.

అంతేకాదు వీటి పక్కభాగాలకు సజీవ పరిమాణంలో ఉన్న ఏనుగుల విగ్రహాలను చెక్కారు. ఈ ఏనుగుల విగ్రహాల ప్రత్యేకత ఏమిటంటే ఏనుగులే ఆలయభారాన్ని మోస్తున్నట్లుగా ఉన్న భంగిమలతో శిల్పులు తీర్చిదిద్దారు. ఈ గుహాలయం పై కప్పు మూడు విభాగాలుగల పొరలతో సూది వంటి శిఖరాకృతిలో గోపురం ముందుకు పొడుచుకొని ఉండి మొనదేలినట్లు కన్పిస్తోంది. పైన అర్ధగోళాకృతిలో నిర్మాణం జరిపారు. బయటి ప్రాంగణం చివరన కుడివైపు మూలనుంచి ఈ ప్రాసాదపు సుందర ముఖాకృతి విలక్షణమైన రూపంలో మాకు దర్శనమిచ్చింది. ఈ గుహాలయం ఉత్తర ప్రాంగణంలో ఒక పెద్ద ఏనుగు శిల్పం మాకు కన్పించింది. దీనికి తొండం లేదు. పక్కనే అతి పెద్దదైన విజయస్తంభం కూడా ఉంది.

ఇంకా పైకి వెళ్లినమాకు పన్నెండు ఫలకాలు గల ఒక గ్యాలరీ కన్పించింది. అందులో శివపురాణ గాథల కల్పనలను శిల్పాలుగా మలిచారు. ఈ గ్యాలరీకి తూర్పు వైపున గల ఫలకాల్లో శివుడు రకరకాల భంగిమల్లో ఉన్నట్లు విగ్రహాలను ఏర్పాటు చేశారు. ఈ గోడకు దక్షిణం వైపున ఉన్న గ్యాలరీ ఆనుకొని ఉంది. అక్కడ విష్ణువు విగ్రహాలు విభిన్న రూపాల్లో మాకు కన్పించాయి.

ఈ గ్యాలరీకి దగ్గరలోనే ఒక అపూర్వమైన శిల్పకళాఖండాన్ని చూశాము. అది "కైలాసాన్ని వణికిస్తున్న రావణుడు" అని ఇంగ్లీషులో అక్కడ రాసి ఉంది. ఈ ఆలయంలో అన్ని వైపులా రకరకాల శిల్పాలు భారతీయ శిల్పుల కళా ప్రతిభకు అద్దం పడుతున్నాయి.

మొదటి అంతస్థులో ముఖ్యమైన కారిడార్‌కి ఆనుకుని అందంగా అలంకృతమైన వరండాలున్నాయి. మధ్యద్వారం నుంచి వెళ్తే ఒక పెద్ద శివలింగం గల గర్భగుడి వచ్చింది.



ఈ ఆలయానికి ఎదురుగా యాభై అడుగులు ఎత్తు కలిగి ముఖ్య కట్టడానికి సమాంతరంగా ఉన్న మందిరం ఒకటి ఉంది. ఇరవై చదరపు అడుగుల వైశాల్యమున్న ఈ మందిరంలో నంది విగ్రహాన్ని మేము చూశాము. ఈ నంది విగ్రహానికి ఇరువైపులా ఒక రాయి, ఒక స్తంభం ఉన్నాయి. ఈ ధ్వజస్తంభం సుమారు యాభై అడుగులకు పైగా పొడవుంటుందని అనుకున్నాము. దీనిమీద సూక్ష్మ శైలిలో ఎన్నో శిల్పాలను చెక్కి ఉన్నారు. మతాభిప్రాయాలను పక్కన పెడితే ఈ పదహారో గుహాలయం మాత్రం భారతీయ శిల్పకళకు ప్రపంచఖ్యాతిని తీసు కొచ్చిందనడంలో ఎలాంటి సందేహం లేదని మాకు అన్పించింది.

పదహారో గుహలో కనువిందు చేసిన శిల్ప సౌందర్యం మా మనసుల్ని మైమర పిస్తుండగానే పదిహేడో గుహలోకి అడుగు పెట్టాము. ఈ గుహలో చాలా పెద్దవైన స్తంభా లున్నాయి. దీని గర్భ గృహంలో ఒక శివలింగం, బ్రహ్మ, విష్ణు, గణపతి, మహిషాసుర మర్దని విగ్రహాలున్నాయి.

ఆ తర్వాత పద్దెనిమిదో గుహ సాధారణంగా కన్పించింది. ఇందులో నాలుగు స్తంభాలతో పాటు గర్భగుడిలో ఒక శివలింగం మాత్రమే ఉంది. పంతొమ్మిదో గుహ కూడా ఇంచుమించు ఇలానే మాకు కన్పించింద. అక్కడినుంచి కొన్ని మెట్లు ఎక్కి ఇరవయ్యో గుహలోకి అడుగుపెట్టాము. పెద్ద పెద్ద ద్వార పాలకుల, పాలికుల విగ్రహాలు కన్పించాయి. గర్భగుహ లోపల ఎంతో అందంగా మలచిన శివలింగం, గణపతి, మహిషాసురమర్ధని విగ్రహాలను మేము చూశాము.

ఇక ఇరవయ్యొకటో గుహ ముఖభాగం ఆకర్షణీయంగా ఉంది. దీని పక్కనే గంగ, యమునల విగ్రహాలున్నాయి, స్తంభాలకు పై భాగంలో స్త్రీ మూర్తుల విగ్రహాలు, వాటిపైన ఆకుల చిత్రాలు, పాదాల కింద పద్మదళాలు చెక్కారు. గదిలోపలున్న ఫలకాలపై శివపార్వతుల కళ్యాణ భంగిమల్లో విగ్రహాలు మలిచారు.

22 నుంచి 24వ నెంబరు గుహ వరకూ అంతగా చూడాల్సినవి ఏవీ లేవని తెలిసి మేము 25వ నెంబరు గుహలోకి వెళ్లాము. ఇది కూడా ఎల్లోరాలోని అతి పెద్ద గుహల్లో ఒకటి. దీని అంతర్భాగంలో రథంతో నిలబడి ఉన్న సూర్యుని పెద్ద విగ్రహం ఉంది. ఏడు గుర్రాలు, వాటిని నడుపుతున్న అరుణ, ఉష, ప్రత్యూషలు ధనస్సూ బాణాలూ ధరించి ఉన్నట్లు చెక్కారు.

ఇరవయ్యారో గుహ అంతకు ముందు మేము చూసిన ఇరవయ్యొకటో గుహనే పోలి ఉంది. ఇరవయ్యేడో గుహలోకి వెళ్లాము. అందులో హలాన్ని ధరించిన బలరాముడు, శ్రీకృష్ణుడు, శేషశాయిగా ఉన్న విష్ణువు, వరాహావతారం, మహిషాసుర మర్ధని తదితర విగ్రహాలను చూశాము.

ఇరవై ఎనిమిదో గుహ ఖాళీగా ఉంది. ఇరవై తొమ్మిదో గుహ పెద్దదే. ఇందులో క్రాస్ ఆకారంలో గదుల వరుసలున్నాయి. ఈ గుహకు మూడు వేర్వేరు ముఖ్యద్వారాలుండడం ఒక ప్రత్యేకత. వెడల్పాటి స్తంభాలతో మెట్లకు ఇరువైపులా సింహాలు కాపలా కాస్తున్నట్లు చెక్కారు. ఇందులో ఉన్న అష్టభుజ శంకరుడు, విలయ తాండవం చేస్తున్న నటరాజు, నదీదేవత యమున తదితర విగ్రహాలన్నీ పెద్ద పరిమాణంలో కన్పించాయి.

వైదిక మత గుహల తర్వాత జైన మతానికి సంబంధించిన గుహలను చూడడానికి



ఉత్తర దిశగా ధమ్మ మిత్రులమంతా నడిచాము. 30 నుంచి 34 వ నెంబరు వరకూ ఉన్న ఈ గుహల్లో ముఖ్యమైనవి 32, 34 నెంబర్ల గుహలే నని అక్కడున్నవారు చెప్పారు. 30వ నెంబరు గుహను 'చోటా కైలాస్' అని వ్యవహరిస్తుంటారు. ఇది 16వ నెంబరు గుహను కొంతవరకూ పోలి ఉంటుంది. దీని స్తంభాలు, పై కప్పులనూ పద్మాకారపు నగిషీలతో చెక్కారు. వర్ధమాన మహావీరుని విగ్రహం, ఆయన చుట్టూ చాలామంది జైన తీర్థంకరుల విగ్రహాలున్నాయి.

31వ నెంబరు గుహలో కూడా మహావీరుని విగ్రహం, తీర్థంకరుల విగ్రహాలున్నాయి. 32వ గుహను 'ఇంద్రసభ' అంటారని పక్కనే ఉన్న ఫలకంలో రాశారు. దీని ముఖద్వారం వద్ద సుమారు 30 అడుగుల ఎత్తైన ఏనుగు విగ్రహం ఉంది. దానికి సమీపంలోనే అందంగా అలంకరించినట్లు చెక్కిన ప్రార్థనాలయం ఒకటుంది. దీని పైకప్పులో జైనమతానికి ప్రతీకాత్మకంగా పద్మాన్ని చెక్కారు. దీనిపై వర్ధమాన మహావీరుని విగ్రహం ఉంది. ఎడమవైపు గదిలో పార్శ్వనాథుని విగ్రహం ఉంది. దీనికి కాపలాగా నాగరాజు స్త్రీ, పురుష సేవకులతో ఉన్నట్లు విగ్రహాలు చెక్కారు.

ఈ వరుసలోనే మహావీరుడు సింహవాహనుడుగా ఉన్నట్లు విగ్రహాన్ని మలిచారు. మరో జైన సాధువు విగ్రహం కూడా ఇక్కడుంది. ఇతడు తన చుట్టూ ఉన్న ప్రపంచానికి అతీతునిగా కఠినమైన తపోభంగిమలో ఉన్నట్లు ఈ విగ్రహాన్ని చెక్కారు. ఈ గుహకుపై అంతస్థులో ఒక వరండా, నగిషీలు చెక్కిన స్తంభాలు గలిగిన పెద్ద మందిరం ఉంది. ఇందులోని జైన విగ్రహాలు, గోడలు, స్తంభాలు ఎంతో సునిశితంగా నగిషీపనితో చెక్కినట్లు విస్మయాన్ని కల్గిస్తున్నాయి.

33వ గుహ అంత ముఖ్యమైనది కాకపోవడంతో ఎల్లోరాలో చివరిదైన 34వ నెంబరు గుహకు వెళ్లాలనుకున్నాం. ఇంద్రసభ గుహ నుంచి పడమటి వైపు ఆలయానికి ఎడమ పక్కనున్న రాతి తలుపుతో కూడిన మార్గం గుండా వెళ్లాము. అక్కడ మరోదారిని కూడా మేము చూశాము. దీనికి ఎంతో సుందరంగా మలిచిన అర్ధచంద్రాకారపు ఆర్చి ఉంది. ఇందులో ఉన్న విగ్రహాలన్నీ సేవక బృందాలతో ఉన్న జైన తీర్థంకరులవే. గోడల్లోనూ స్తంభాలపైనా జైన తీర్థంకరుల విగ్రహాలను విరివిగా చెక్కారు. ఈ గుహ జైన శిల్పకళకు చక్కని ప్రతీకగా మాకు కన్పించింది.

(ఇంకా వుంది)

-రచయిత సెల్ : 73968 66888

# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర



-బెందాళం కృష్ణారావు

(గత సంచిక తరువాయి-4)

**'బీబీ-కా- మక్బరా'**

ఎల్లోరా గుహల సందర్శనం పంచిన అద్భుతానుభూతిని మా ధమ్మ మిత్రులందరమూ మననం చేసుకుంటూ ఉండగానే మా బస్సు ఔరంగాబాద్‌కు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్న 'బీబీ-కా-మక్బరా' కు చేరింది. పార్కింగ్ స్థలంలో మా బస్సు నిలిచింది. ప్రవేశం టిక్కెట్లు ఐదు రూపాయల చొప్పున చెల్లించి ధమ్మయాత్ర నిర్వాహకులు పామర్తి రవి గారు అందర్నీ సమాయత్తం చేశారు. మా ధమ్మయాత్ర ప్రణాళికలో 'బీబీ-కా-మక్బరా' సందర్శన అనేది ముందుగా లేకపోయినా అన్య సంప్రదాయాలపై ఉన్న గౌరవం అటువైపు నడిపించింది. ప్రవేశద్వారం లోపలకు అందరం కదిలాం. లోపలకు అడుగు పెట్టగానే ఒక అర్ధ గోళాకారపు కట్టడం కన్పించింది. దాని కింద నిల్చొని చూసిన మాకు మొత్తం కట్టడం అంతా ఎంతో అందంగా కన్పించింది. సమాధి ఉన్న ప్రధాన నిర్మాణం దగ్గరకు నడిచివెళ్లే మార్గాలకు ఇరువైపులా నీటి రిజర్వాయర్లను ఏర్పాటు చేశారు. మొఘల్ పాదుషాల్లో ముస్లిం మతాన్ని ఎక్కువగా అభిమానించి ఆచరించిన ఔరంగజేబు తన భార్య 'రబియా-ఉద్-దురానీ' స్మృతి చిహ్నంగా దీనిని 1679లో నిర్మించాడని గైడ్ తెలియజేశాడు. ఇది ఔరంగజేబు తండ్రి షాజహాన్ ఆగ్రాలో నిర్మించిన తాజ్‌మహల్‌ని పోలిన నిర్మాణం కావడంతో అంతా మినీ తాజ్‌మహల్‌గా పిలుస్తుంటారు. అయితే ఇది తాజ్‌మహల్‌కి నాసిరకమైన అనుకరణ మాత్రమే. దగ్గరకు వెళ్లి చూస్తే దీని బాహ్య రూపంలో తాజ్‌మహల్‌కు సమన్వయం కన్పించదు. ఈ కట్టడానికి చలువరాతితో నిర్మించిన గుమ్మటం ఉన్నప్పటికీ గోడలు మాత్రం ప్లాస్టర్ చేశారు. దీనికి అష్టకోణాకారంలో రంధ్రాలతో ఉన్న చలువరాతి ప్రహరీగోడను నిర్మాణం చేశారు. లోపలి భాగంలోని నగిషీ పని తాజ్‌మహల్‌లోని అద్భుత వాస్తు శిల్పకళతో ఏ మాత్రం పోల్చదగినది కాదు. అయినప్పటికీ 'బీబీ-కా-మక్బరా'కు తనదైన దర్జా, వైభవం ఉన్నాయని గైడ్ చెప్పాడు. గైడ్ హిందీలో చెప్పిన విషయాలను ధమ్మమిత్రుడు లియాఖత్ ఆలీగారు తెలుగులో చక్కగా వివరించారు. ఈ కట్టడం చుట్టూ బురుజులుతో కూడిన ఎత్తైన గోడ ఉంది. మధ్య ప్రదేశంలో చిన్న చిన్న మీనార్‌లున్నాయి. పై భాగం నుంచి చూస్తే ఔరంగబాద్ పట్టణంలో కొంతభాగం కన్పిస్తోంది. అన్ని కోణాల్లో ఫొటోలు, వీడియో చిత్రీకరణలను ధమ్మ మిత్రులు నందం నరసింహారావు చేశారు. ఇలా 'బీబీ-కా-మక్బరా' సందర్శన పూర్తి చేసుకుని, మళ్లీ మా బస్సు దగ్గరకు వచ్చాము. మాతో కలిసి వస్తున్నట్లే కన్పించిన పామర్తి రవిగారు ముందుగానే బస్సు పార్కింగ్ స్థలానికి చేరుకుని పక్కనే అమ్ముతున్న బొప్పాయి, పైనాపిల్ పండ్ల ముక్కలను కొని మా అందరికీ అందజేశారు. బస్సులో తిరిగి మా బసకు చేరుకుని అక్కడ నుండి నేరుగా బస్సులో రాత్రి పది గంటలకు జలగామ్ చేరుకున్నాం. అక్కడే మంచి హోటల్‌లో బసను ఏర్పాటు చేయించారు. నేనూ లియాఖత్ ఆలీగారూ ఒక

10



రూములో, మిగిలిన ధమ్మమిత్రులు వారికి అనువైన రూముల్లో అంతా సర్దుకున్నాము. తర్వాత రోజు ఉదయమే ఐదు గంటలకు మధప్రదేశ్‌లోని సాంచికి ట్రైన్‌లో వెళ్లాల్సి ఉండడంతో అంతా నిద్రకు ఉపక్రమించాం.

మార్చి 3వ తేదీ ఉదయం నాలుగు గంటలకే అంతా సిద్ధమైపోయాం, ఆటోల్లో జలగామ్ రైల్వే స్టేషన్‌కు చేరుకున్నాం. మేము ఎక్కాల్సిన ట్రైను గంటన్నర ఆలస్యంగా రావడంతో స్టేషన్‌లోనే అల్పాహారాన్ని ముగించాం. రైల్వే అనౌన్సర్ చెప్పిన సమయానికే ట్రైన్ రావడంతో అందులోకి ఎక్కాం. అయితే రిజర్వేషన్ల వారీగా అందరికీ ఒకే బోగీలో బెర్తులు రాలేదు. ఆయా సీట్ల నెంబర్ల ప్రకారం ఆయా బోగీల్లో కూర్చొన్నాము. మధ్యాహ్న భోజనానికి ముందుగా ఏమి సిద్ధం చేసుకోకపోయినా పామర్తి రవి గారు అందరికీ ఇంటి నుండి తీసుకొచ్చిన తినే పదార్థాలను, ట్రైన్‌లో కొన్న పండ్లను అందజేసి ఆకలి సమస్య రాకుండా చేశారు. సాయంత్రం నాలుగు గంటలకు మా ట్రైన్ సాంచి స్టేషన్‌కు చేరింది. సాంచికి తర్వాత వచ్చే రైల్వే స్టేషన్ విదిశలో బస చేసి అక్కడి నుండి సాంచి వెళ్లాలన్నది మా ప్రణాళిక. అయితే సాంచిలో బస చేయడానికి తగిన సౌకర్యాలున్నాయని తెలియడంతో సాంచి స్టేషన్‌లోనే అందరం దిగిపోయాం సాంచి స్టేషన్ చాలా చిన్నది. ఈ స్టేషన్‌లో దిగి రాత్రి బసకు ఏం చేయాలా? ఎక్కడ వీలౌతుందో? అని ఆలోచిస్తున్న సమయంలోనే ఎదురుగా ఒక భంతేజీ (బౌద్ధ సన్యాసి) నడుచుకుంటూ రావడం కన్పించింది. ఆయనను పామర్తి రవిగారు అభివాదాలతో పలుకరించి తామంతా తెలుగు రాష్ట్రాల నుంచి వచ్చిన ధమ్మమిత్రులమని తమ ధమ్మయాత్ర విశేషాలను తెలియజేసారు. రాత్రి బసకు అనువైన స్థలాల గురించి ఆయనను అడిగిన వెంటనే తమ శ్రీలంక మహాబోధి సొసైటీ విహారాలో తగిన అవకాశముందని, పక్కనే వంటశాల సౌకర్యం కూడా ఉందని చెప్పడంతో ఎంతో ఆనందించాము. స్టేషన్ దాటి అక్కడకు చేరుకున్నాము. శ్రీలంక మహాబోధి సొసైటీ వారు నిర్మించిన పురాతన భవనమది. అందులో ఒక్కో గదిలో

ఇద్దరు, ముగ్గురు చొప్పున నామమాత్రపు రుసుముతో బస చేయడానికి వీలౌతుందని నిర్వాహకులు చెప్పారు. స్నానాలు, ఇతర కాలకృత్యాలు తీర్చుకోవడానికి కూడా వంటశాల వెనుకనే గదుల ఏర్పాటు ఉంది. ఆధునికంగా నిర్మించిన ఒక పెద్ద భవనం కూడా ఉంది. అయితే అందులో బస చేయడానికి శ్రీలంక నుండి రెండు బస్సుల్లో ధమ్మ యాత్రికులు, ఉపాసకులు పెద్ద సంఖ్యలో వస్తున్నారని వారి కోసం అందులో గదులను ఉంచామని నిర్వాహకులు చెప్పడంతో పాత భవనంలోని గదులతోనే మేము సరిపెట్టుకోవాల్సి వచ్చింది. మాకు గదులు కేటాయించిన చోటే పక్కన ధ్యానం చేసుకోవడానికి హాలు కూడా ఉంది. నేనూ, రవిగారూ, నందం నర్సింహరావుగారూ ఒక గదిలో మా సామాగ్రిని ఉంచుకున్నాం. వాతావరణం చిరుజల్లులతో బాగా చలిగా ఉండటం, గదుల నిండా దోమలు స్వైర విహారం చేస్తుండడంతో రాత్రంతా జాగారం తప్పదేమోని భయపడ్డాం. అయితే వాటిని తరమడానికి తగిన ఏర్పాట్లు జరగడంతో ఊపిరి పీల్చుకున్నాం. ఇక వంట ఏర్పాట్లలో పడ్డాం. నేనూ, నందం నర్సింహారావుగారూ పక్కనే ఉన్న మార్కెట్‌లో వంటగ్యాస్ స్టవ్, సిలెండర్, వంటపాత్రలు వంటివి అద్దెకు తీసుకువచ్చాం, కూరగాయలు, పెరుగు, పాలు వంటివి కొనుగోలు చేశాం. దోమల సమస్య నుంచి గట్టెక్కడానికి ఆలౌట్, గుడ్‌నైట్, హిట్ వంటివి కొనుక్కొని తీసుకురాక తప్పలేదు. మాతో తీసుకొచ్చిన పప్పులు, బియ్యం, ఇతర సామగ్రితో వంటను ప్రారంభించేశాం. నీళ్ల క్యాన్లను కూడా కొనుగోలు చేసి తీసుకొచ్చాం. మా బృందంలోని రేఖా స్వరాజ్యలక్ష్మి, చాగంటి ఆదిలక్ష్మి, అరుమళ్ల వెంకటవర్ధిని, సుంకర లక్ష్మికామేశ్వరి, చిలకా బసవమ్మ తదితరులు కూరగాయలు తరగడంలోనూ ఇతర వంటపనిలోనూ సహకరించారు. రేఖా శ్రీనివాసరావుగారు అందరికీ రుచికరమైన భోజనాన్ని వండి వడ్డించారు. తృప్తిగా తిని నిద్రలోకి జారుకున్నాం. మేము భయపడినంతగా దోమలు ఎలాంటి ఇబ్బందులు కల్గించలేదు మాకు.



10

## సాంచికి ధమ్మప్రస్థానం

మార్చి 4వ తేదీ ఉదయమే మేల్కొన్నాం. మహోన్నత మానవతామూర్తి గౌతమ బుద్ధుని చితా భస్మం, ఆయన అవశేషాలపై నిర్మించిన సాంచి స్థూపాన్ని ఎప్పుడెప్పుడు చూస్తామా! అని తహతహలాడుతూ ఉదయమే వేన్నీళ్లతో స్నానాన్ని ముగించాం. అందరూ కాలకృత్యాలు ముగించి వచ్చేటంతవరకూ కృష్ణార్జునబోధిగారూ మరికొంతమంది ధమ్మ మిత్రులు మెడిటేషన్ హాలులో ధ్యానంలో ఉన్నారు. ఈలోగా రేఖా శ్రీనివాసరావు రుచికరమైన ఉప్మాను అల్పాహారంగా తయారు చేశారు. సాంచీ స్థూపాన్ని సందర్శించడానికి ముందే దాని చరిత్ర విశిష్టతను గురించి తెలుసుకున్నాం. అయితే ప్రత్యక్షంగా దర్శించనుండటం ఇదే నాకు తొలిసారి.

### సాంచీ విశిష్టత :

క్రీస్తు పూర్వం 3వ శతాబ్దానికి చెందిన అశోక చక్రవర్తి ఈ సాంచీ మహాస్థూపాన్ని నిర్మించాడు. మధ్యప్రదేశ్ రాష్ట్రం రాయసేన్ జిల్లాలో ఉన్న ఒక చిన్న గ్రామం సాంచీ. సాంచికి ఒకప్పుడు విదిశాగిరి, కకనాయ, చెటియాగిరి అనే పేర్లు కూడా ఉండేవి. బెటదా నదీ తీరంలో సాంచీ ఉంది. క్రీస్తు పూర్వం 274-237 మధ్యకాలంలో అశోకుని హయాంలో సాంచికి ఎనలేని ప్రత్యేకత ఏర్పడింది. అయితే ఈ మహాస్థూపం కారణంగానే దీనికి అంతర్జాతీయ స్థాయిలో ఒక గుర్తింపు వచ్చింది. ఇది విదిశా నగరానికి పది కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ విదిశా నగరం అశోకుని జీవితంతో విడదీయరాని సంబధాన్ని కలిగి ఉంది. ఆయన కాలంలో అది అతి ముఖ్యమైన వ్యాపార కూడళ్లలో ఒకటి. ఆయన యవ్వన ప్రాయంలో రాజ ప్రతినిధిగా ఈ నగరంలో కొన్నాళ్లు నివసించాడు. ఆ నగరంలో ఒక వ్యాపార ప్రముఖుని కుమార్తెను అశోకుడు వివాహం చేసుకున్నాడు. అశోకునికి గల ఆరుగురి భార్యల్లో విదిశ అనే పేరుగల ఈమెకు కలిగిన సంతానమే మహేంద్రుడు, సంఘమిత్ర. వీరిద్దరూ శ్రీలంకలో ప్రచారం చేయడానికి వెళ్లే ముందు మహేంద్రుడు కొంతకాలం పాటు విదిశా నగరంలో నివసించాడు.

అశోకుడు బౌద్ధ ధమ్మాన్ని స్వీకరించిన తర్వాత తన ధమ్మవ్యాప్తిలో భాగంగా గౌతమ బుద్ధుని చితాభస్మం, అస్థికలు, ఇతర అవశేషాలను సమీకరించి సాంచీలో అత్యంత పెద్దదైన స్థూపాన్ని నిర్మించాలని సంకల్పించాడు. అందులో భాగంగానే ఏడుచోట్ల ఉన్న గౌతమ బుద్ధుని అవశేషాలను సేకరించి ఈ స్థూపాన్ని నిర్మించాడు. పక్కనే మూడో స్థూపంలో గౌతమ బుద్ధుని శిష్యులైన సారిపుత్ర, మహా మొగ్గలాయనుల అవశేషాలను నిక్షిప్తం చేశాడు. అశోకుని కాలంలో రూపుదిద్దుకున్న మహాస్థూపం, మరో రెండు స్థూపాలు తర్వాత శుంగ వంశరాజుల కాలంలో నిర్మించిన భవనాలు, అనంతరం శాతవాహనుల కాలంలో జరిగిన నిర్మాణాలు తోరణాలు, రాతి స్తంభాలు, స్థూపపునరుద్ధరణలు, ఇలా మొత్తం సుమారు యాభై రకాల స్మారక స్థూపాలను, నిర్మాణాలను సాంచీ కొండపై చూడొచ్చని తెలుసుకున్నాం. క్రీస్తు పూర్వం 3వ శతాబ్దం నుంచి క్రీస్తు శకం 13వ శతాబ్దం వరకూ ఎంతో విశిష్టతను సంతరించుకున్న సాంచీ స్థూపం ఇతర నిర్మాణాలు ఆ తర్వాత ఈస్టిండియా కంపెనీ అధికారి 1,2,3 స్థూపాలను కనుగొన్నాడు. సాంచీ ఉనికిని తొలిసారిగా ఆధునిక ప్రపంచానికి



వెలికితీసిన చరిత్ర పరిశోధకునిగా ఈయన గుర్తింపు పొందాడు. దాంతో ఒకపక్క ఔత్సాహిక చరిత్ర పరిశోధకులు, పురావస్తు శాస్త్రవేత్తలు ఈ సాంచీస్థూపం విశేషాలపై అధ్యయనం ప్రారంభించారు. గుప్తనిధుల అన్వేషకులు కూడా ఈ ప్రాంతాన్ని ఇష్టారాజ్యంగా తవ్వేశారు. 1881 నాటికి ఈ స్థలాన్ని బ్రిటీష్ ప్రభుత్వం రక్షిత ప్రాంతంగా ప్రకటించింది. శిధిలావస్థలో ఉన్న మహాస్థూపం పునరుద్ధరణ పనులు, ఇతర నిర్మాణాలు, అవశేషాలను భద్రపర్చడం చేశారు. ప్రస్తుతం సందర్శకులకు కన్పించే ఈ నిర్మాణాలను 1912నుంచి 1919 మధ్య కాలంలో ప్రఖ్యాత పురావస్తు శాస్త్రవేత్త సర్ జాన్‌మార్షల్ నేతృత్వంలో పునరుద్ధరించారు. వీటిలో ప్రధానమైనవి మూడు స్థూపాలు, పలు ఆలయాలు కూడా ఉన్నాయని తెలుస్తోంది. వీటన్నింటినీ యునెస్కో 1989లో ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తించింది. జాన్ మార్షల్ నేతృత్వంలోనే సాంచి కొండపై లభించిన విగ్రహాలు, ఇతర పురాతత్వ అవశేషాలతో కొండ దిగువన ఒక పెద్ద మ్యూజియంను ఏర్పాటు చేశారు.

ప్రాచీన కట్టడాలలో అత్యంత ప్రముఖమైనదిగా సాంచీ గుర్తింపు పొందింది. బ్రిటీష్‌వారు ఈ దేశంలో తమ పరిపాలనా కాలంలో వైస్రాయ్ నివసించే భవనాన్ని విశిష్టమైన కళాకౌశలంతో నిర్మించాలని భావించారు. అందుకోసం అంతర్జాతీయ స్థాయిలో పేరెన్నికగన్న ఎన్నో కట్టడాల నమూనాలను పరిశీలించారు. చివరికి సాంచీ స్థూప నమూనాతో దేనినీ సరిపోల్చుకోలేక దానిని వైస్రాయ్ భవనంపై మకుటంగా కట్టించారు. అదే ఇప్పుడు రాష్ట్రపతి భవన్‌గా విలసిల్లుతోంది. అంతేకాదు ప్రపంచంలోనే అత్యంత అరుదైన కట్టడాల్లో ఒకటిగా, ప్రపంచ వింతగా కళావిమర్శకుల ప్రశంసలు అందుకుంటున్న తాజ్‌మహల్ నిర్మాణంలో కూడా సాంచీ స్థూప నమూనాను వినియోగించారు. అందువల్లే తాజ్‌మహల్ పై భాగంలో ఉన్న గోళాకార నిర్మాణం సాంచీ స్థూపాన్నే పోలి ఉంది. ఇన్ని విశిష్టతలున్న సాంచీ స్థూప సందర్శన కోసం మేమంతా ఆసక్తిగా చర్చించుకుంటున్న సమయంలో మమ్మల్ని అక్కడకు తీసుకు వెళ్లడానికి ఒక స్కార్పియో, మరో బొలెరో వాహనాలను పామర్తి రవిగారు ఏర్పాటు చేశారు. **(ఇంకావుంది)**

*-రచయిత సెల్ : 73968 66888*

# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర



-బెందాళం కృష్ణారావు

(గత సంచిక తరువాయి-5)

శ్రీలంక మహాబోధి సోసైటీ ప్రాంగణం నుంచి బయలుదేరి రెండు వాహనాల్లో మేమంతా సాంచిస్థూపం ఉన్న కొండ పైభాగానికి చేరుకున్నాం. అంతకు ముందు మాకు కొంత దూరం నుంచే సాంచీ మహా స్థూపం కనువిందు చేస్తూ కన్పించింది. స్థూపం ఇతర ప్రధాన విశేషాల సందర్శనకు భారతపురావస్తు సర్వేక్షణశాఖ వారు ఏర్పాటు చేసిన కౌంటర్‌లో టిక్కెట్లు తీసుకున్నాం. దానిని ఆనుకునే పురావస్తు శాఖ ప్రచురణల విభాగం నిర్వహిస్తున్న బుక్‌స్టాల్ కూడా ఉంది. మేమంతా అందులోకి వెళ్లాం. దేశంలోని ప్రాచీన నిర్మాణాలు వంటి వాటిపై చాలా పుస్తకాలుఉన్నాయి అందులో, దాదాపు అన్ని పుస్తకాలు ఇంగ్లీష్‌లో ఉన్నాయి. ధర కొంత ఎక్కువగా అన్పించినా వాటి ముద్రణ, చక్కని ఛాయాచిత్రాలు రంగురంగుల్లో ప్రతీ పుస్తకంలోనూ దర్శనమిచ్చాయి. నేనూ, ఆలీగారూ, బోధిగారూ కొన్ని పుస్తకాలు తీసుకున్నాం. అక్కడే ఒక ఉద్యోగి గైడ్‌గా వస్తానని మాతో చెప్పారు. కానీ గైడ్‌గా సర్వీస్ చేసినందుకు చెల్లించాల్సిన సొమ్ము కూడా కాస్త ఎక్కువగా అన్పించడంతో ఇంకెవరైనా గైడ్లు ఉంటారేమోనని వెతికాం. తర్వాత తెలిసింది అక్కడ ప్రైవేట్ గైడ్లు ఎవరూ ఉండరని పురావస్తు శాఖ సిబ్బందే గైడ్లుగా వ్యవహరిస్తుంటారని. చేసేదిలేక అతనినే గైడ్‌గా మాట్లాడుకుని ఆయనతో పాటు మేమంతా గేటు తీసుకుని లోపలకు నడిచాము.

మహాస్థూపం లాంటివే పరిమాణంలో చిన్నవిగా ఉన్న మరో రెండు స్థూపాలు కూడా మాకు కన్పించాయి. మేము ముందుగా మహా స్థూపం వైపు ఉన్న మార్గంలో వెళ్లాము. మాతో పాటు వస్తున్న గైడ్ మాకు సాంచి విశిష్టతని హిందీలో వివరిస్తున్నారు.."మధ్యప్రదేశ్‌లోని రైసిన్ జిల్లాలో ఉన్న ఈ ప్రదేశం ప్రాచీనకాలం నుంచీ గుర్తింపు పొందింది. అప్పట్లో సాంచికి "కాకనాయ" అనే ప్రాచీనమైన నామం ఉండేది. భోపాల్ నగరానికి 30 కిలో మీటర్ల దూరంలో 91 మీటర్ల ఎత్తులో ఉన్న కొండపై ఈ సాంచీ స్థూపం ఉంది. దీని పక్కనే ఉన్న విదిశ ఒకప్పుడు తూర్పు మాళ్వా (ప్రాచీన కాలంలో ఆకల రాజ్యం) నకు రాజధానిగా ఉండేది. సాంచి స్థూపానికి చుట్టుపక్కలా 20 కిలోమీటర్ల విస్తీర్ణంలో బౌద్ధ నిర్మాణాలు అనేకం చారిత్రక పరిశోధకులకు లభించాయి. సమ్రాట్ అశోకుని కాలం (క్రీ.పూ 273-236) లో సాంచీ స్థూపాన్ని నిర్మించారు. తన యవ్వనకాలంలో రాజప్రతినిధిగా ఉన్న సమయంలో అశోకుడు విదిశానగరంలో ఉండేవాడు. అప్పట్లో విదిశానగరంలో ఒక వ్యాపారి కుమార్తె విదిశాదేవిని వివాహం చేసుకున్న అశోకుడు ఆమెద్వారా మహేంద్రుడు, సంఘమిత్ర అనే కొడుకు, కూతురును కన్నాడు.

కళింగ యుద్ధం తర్వాత బౌద్ధ ధమ్మాన్ని స్వీకరించిన అశోకుడు తన జీవితంతో ముఖ్యంగా ముడిపడి ఉన్న విదిశ ప్రాంతంలో ఉన్న సాంచి కొండమీద విహారాలను, స్థూపాన్ని

నిర్మించడానికి అనుకూలమైనదిగా ఎంపిక చేశాడు. ఈ ప్రదేశం ధ్యానానికి ప్రశాంత వాతావరణంలో అనుకూలంగా ఉంటుందని ఆయన భావించాడు. అంతేకాకుండా ఈ ప్రాంతం బెత్వా, బెస్ నదుల మధ్య ఉండడం, రెండు ప్రధాన వాణిజ్య మార్గాలకు కూడలిగా ఉండడంతో ఈ ప్రదేశాన్నే స్థూపనిర్మాణానికి ఎంపిక చేశాడు. సాంచీ నిర్మాణాలను రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. వాటిలో కొండపైన ఉన్న మహాస్థానం ఇతర నిర్మాణాలు ఒకరకానికి చెందినవి అనుకుంటే కొండకు పశ్చిమవాలులో ఉన్నవి రెండో రకంగా భావించాలి. కొండపైన అసమగ్రాకారంలో ఉన్న పీఠభూమి వంటి ప్రదేశంలో ముఖ్యమైన నిర్మాణాలున్నాయి. ఇవి ఉత్తర దక్షిణ దిశల్లో 384 మీటర్లు, తూర్పు పడమర దిశల్లో 201 మీటర్ల మధ్య విస్తరించి ఉన్నాయి. వీటిలో మూడు ముఖ్యమైన భాగాలున్నాయి. ఒకటి ప్రధాన ఉపరితలం, రెండోది తూర్పు ప్రదేశం, మూడోది దక్షిణ ప్రదేశం. ఇవన్నీ క్రీస్తు పూర్వం 3వ శతాబ్దం నుంచి క్రీస్తుశకం 12వ శతాబ్దం మధ్యకాలం వరకూ నిర్మించారు. ఈ నిర్మాణాలను పరిశోధించిన సర్‌జాన్ మార్షల్ 1 నుంచి 50 వరకూ నెంబర్లను కూడా ఇచ్చారు. అయితే అంతకుముందు కన్నింగ్‌హామ్ పెట్టిన నెంబర్లను స్వల్ప మార్పులతో ఈయన వాటికి పెట్టారు. ఈ కొండ దిగువ భాగం నుండి పైకి రావడానికి మెట్ల మార్గం కూడా ఉంది...." ఇలా మాకు గైడ్ హిందీ చెబుతున్న విషయాలను లియాఖత్ ఆలీ గారు తెలుగులో తర్జుమా చేస్తూ వివరిస్తుండగానే మేము సాంచి మహాస్థూపం వద్దకు చేరుకున్నాం. ఈ మహాస్థూపానికి నాలుగు దిశల్లో నాలుగు ప్రవేశ ద్వారాలున్నాయి. ఈ మహా స్థూపం అర్ధగోళాకార రూపంలో ఉంది. పైన మూడు వరుసల్లో ఛత్రం ఉంది. దానిని త్రిరత్నాలకు ప్రతీకగా నిర్మించారని కృష్ణార్జున బోధిగారు చెప్పారు. ఈ స్థూపం ఎత్తు 36.6 మీటర్ల ఎత్తు ఉందని, దానిపై నిర్మించిన ఛత్రం ఎత్తు 16.4 మీటర్లని మొత్తంఎత్తు 53 మీటర్లని, స్థూపం చుట్టుకొలత 120 మీటర్లని పక్కనే ఉన్న శిలాఫలకంపై రాసి ఉంది.

అశోకుడు నిర్మించిన స్థూపం అతని తదనంతరకాలంలో శత్రువుల దాడుల్లో చాలావరకూ నాశనం కాగా శుంగుల కాలంలో క్రీస్తుపూర్వం 2వ శతాబ్దం తర్వాత పునర్నిర్మాణం జరిపి



11



పెద్దదిగా మార్చారని తెలిసింది. ఈ స్థూపం పైకి వెళ్లడానికి మెట్లదారి కూడా ఉంది. దీని చుట్టూ వలయాకారంలో ప్రదక్షిణలు చేయడానికి సరిపోయేటంత మార్గం ఉంది. అశోకుని ఇతర నిర్మాణాలను పోలినట్లు ఒకే పరిమాణంలో ఉన్న పెద్ద పెద్ద ఇటుకలను ఇక్కడ వినియోగించారు. ఛత్రం చుట్టూ చునార్ శాండ్‌స్టోన్ (ఇసుకరాయి)తో నిర్మాణాన్ని ఒక ప్రహారీలా రూపొందించారు. వీటి కిందనే బుద్ధుని అస్థికలను ఉంచి వాటికి నీడనిచ్చే విధంగా పై భాగాన్ని ఛత్రంగా నిర్మాణం చేసారు. ఈస్థూపానికి చుట్టూ ప్రదక్షిణ మార్గం, వెలుపల పాలరాతి ప్రహరీగోడ ఉన్నాయి. ఈ మహాస్థూపానికి ఉన్న నాలుగు తోరణ ద్వారాల్లో దక్షిణ దిశలో ఉన్నది మొదటి ద్వారంగా చెబుతారు. అక్కడే అశోకుని స్తంభం, పైకి వలయాకార మార్గంలోకి వెళ్లడానికి వీలుగా మెట్ల వరుస కూడా అక్కడే ప్రారంభమౌతుంది. మిగిలిన ఉత్తర, తూర్పు, పడమర దిశల్లోని ద్వారాలు ఆ తర్వాత కాలంలో నిర్మించారని గైడ్ మాకు చెప్పారు. ఈ ద్వారాల ఎత్తు 8.53 మీటర్లు, ఈ ద్వారాల్లోని స్తంభాల్లో మూడు ఆర్చిలు చొప్పున నిర్మించారు. నాలుగు చతురస్ర భాగాలుగా వాటిని రూపొందించారు. వీటిలో రెండింటిని బాలమిత్ర అనే బౌద్ధ ఉపాసిక దానంగా ఇచ్చారని తెలుస్తోంది. మరో రెండింటిని కురారా గ్రామానికి చెందిన నాగపియ అనే బౌద్ధ ఉపాసిక బహుకరించారని గైడ్ చెప్పారు. దక్షిణ ద్వారం చాలా వరకూ శిధిలమైంది. కానీ ఉత్తరంగా ఉన్న ద్వారం బాగా స్థిరంగా ఉంది. దాని శిల్పకళా సౌందర్యాన్ని చూసి మిగిలిన స్తంభాల పనితనపు నైపుణ్యాన్ని పోల్చుకోవచ్చు.

ప్రతి ప్రవేశ ద్వారం వద్ద లోపలికి వెళ్లగానే ఎదురుగా బుద్ధుని విగ్రహాలున్నాయి. అవి కొన్ని విరిగిపోయి ఉండడం బాధ అన్పించింది. పడమటి దిశలో ఉన్న ద్వారంపై బుద్ధుని జీవితంలో ఏడు ముఖ్యమైన ఘట్టాలను శిల్పాలుగా చిత్రీకరించారు. దక్షిణ ద్వారంలో బుద్ధుని జనన సన్నివేశం, తూర్పు దిక్కున ఆయన రాజ్యాన్ని విడిచిపెట్టి వెళ్తుండడం, నీటిపై నడుస్తున్న

దృశ్యం. ఉత్తరం వైపు ఒక వృక్షం కింద కూర్చొని బుద్ధుడు బోధలు చేస్తున్నట్లు, బుద్ధుని కాళ్ల నుంచి అగ్నిశిఖలు, తలనుంచి జల ప్రవాహాలు, దేవతలు బుద్ధుని గొప్పతనాన్ని మంగళవాయిద్యాలతో చాటు తున్నట్లు పలు దృశ్యాలు కన్పించాయి. ఈ స్తంభాలు, ఆర్చిలపై జాతక కథల్లో ముఖ్యమైన చద్దాంత జాతక, సామజాతక, మహాకపి జాతక, వెస్సాంతర జాతక, అలంబస జాతక...తదితర గాథల్లోని ముఖ్య సన్నివేశాలను సునిశితమైన శిల్పకళద్వారా అవిష్కరించారు. ప్రతీ తోరణ ద్వారం వద్దా రెండు ఆర్చీలపై నాలుగువైపులా నాలుగు సింహాలు, ఏనుగులను శిల్పాలుగా మలిచారు. బానపొట్టలతో వాటిని భారంగా మోస్తున్న మనుషుల హావభావాలను ప్రదర్శించే విధంగా శిల్పాలు చెక్కారు. దిగువ ఆర్చిలపై అశ్వికులు, ఎనుగులను తోలుతున్నవారు, సాలబంజికల శిల్పాలు కన్పిస్తున్నాయి. కొన్ని ఆర్చిలపై ధర్మచక్రం, బుద్ధ, ధమ్మ, సంఘ త్రిశరణాలను కూడా చెక్కి ఉన్నారు. తామర పువ్వులను సునితమైన శైలిలో చెక్కారు. ఈ ఆర్చ్‌లపై శిల్పాలను నాలుగు రకాలుగా విభజించ వచ్చు. జాతక కథలలోని దృశ్యాలు, బుద్ధుని జీవిత దృశ్యాలు, బౌద్ధమతంలోని పరిణామాలకు సంబంధించిన దృశ్యాలు, వివిధ రకాల పుష్పాలు, చెట్లు, జంతువుల శిల్పాలుగా వాటిని మేము గమనించాం. బుద్ధునికి బదులుగా ఆయనని ఒక ధమ్మప్రతీకగా భావించి శిల్పకళా కారులు వివిధ లక్షణాలను ఆపాదించి అందుకు ఆయన విడిచిపెట్టిన అశ్వం, ఆయన పాదముద్రలు, బోధివృక్షం, ఇలా రకరకాల గుర్తులు చెక్కి ఆ మహనీయునికి మానవదేహం పరిమితం కాదనే ఊహతో చెక్కారని అన్పించింది. ఆనాటి శిల్పులు రాతి, ఏనుగుదంతం, లోహ ఉపకరణాలతో వీటిని చెక్కారని తెలుస్తోంది.

బుద్ధుని చితా భస్మం ఉన్న మొదటి స్థూపాన్ని చాలా అందంగా రూపొందించారు. మిగిలిన రెండు స్థూపాలు పరిమాణం రీత్యా కూడా బగా చిన్నవి. వాటినిర్మాణంలో అంత పనితనం కన్పించ లేదు. ఈ స్థూపంలో రెండు రాతి పేటికలు లభించాయని, వాటిలో పూసలు, ముత్యాలతో ఉన్న ఎముకలు కూడా లభించాయని, వాటిపై రాసిన అక్షరాలను బట్టి అవి బుద్ధుని ప్రధాన శిష్యుల్లో ముఖ్యులైన సారిపుత్ర, మహామగ్గలాయనలవి అని గైడ్ చెప్పారు. ప్రస్తుతం ఆ రాతి పేటికలు లండన్‌లో ఉన్నాయని ఆయన తెలిపారు. ఈ స్థూపాలతో పాటు రకరకాల నిర్మాణాలు ఇక్కడ ఉన్నాయి. వివిధ పరిమాణాల్లో పునాదుల వరకే నిర్మించిన స్థూపాలు అనేకం ఉన్నాయి. ఇవన్నీ బౌద్ధ భిక్షువుల సమాధులై ఉంటాయని మేము భావించాము. చిన్న చిన్న గుడుల సముదాయాలు కూడా ఉన్నాయి. సుమారు 50 వరకూ రకరకాల నిర్మాణాలు ఇక్కడున్నాయి. ప్రధాన స్థూపాలను శుంగ వంశరాజుల కాలంలో పునరుద్ధరించగా, క్రీస్తు శకం 70లో శాతవాహనుల పాలనలో తోరణ ద్వారాలను, స్తంభాలను, రాతి స్తంభాలను నిర్మాణం చేశారని గైడ్ చెప్పారు. గుప్తుల కాలంలో వివిధ రకాల గుడులు నిర్మించారని, బుద్ధుని విగ్రహాలను కూడా అప్పుడే నెలకొల్పారని ఆయనే తెలిపారు. బౌద్ధాభిమానులైన ప్రజల విరాళాలతోనే ఈ నిర్మాణాలను చేశారని గైడ్ మాకు వివరించారు. మా ధమ్మ మిత్రుల బృందం అక్కడున్న అన్ని చారిత్రక అవశేషాలను పరిశీలించింది. ధమ్మమిత్రుడు నరసింహారావు ఈ సందర్శన అంతటినీ ఛాయాచిత్రాలుగా, వీడియో దృశ్యాలుగా చిత్రీకరించారు.

అక్కడే సమీపంలో ఏర్పాటు చేసిన వస్తు విక్రయశాలను కూడా సందర్శించాం. అయితే ధరలు చాలా ఎక్కువగా ఉండడంతో వాటిని కొనుగోలు చేయలేదు. అందరం తిరిగి మా

వాహనాల వద్దకు చేరుకున్నాం. వాటిలో దిగువకు బయలుదేరాం. అందరూ మేము ముందురోజు బసచేసిన శ్రీలంక మహాబోధి సొసైటీ విహారకు చేరుకోవాలనే ఉత్సుకతతో ఉన్నారు. ఇంతలో మాకు సాంచి బౌద్ధ ప్రదర్శనశాల కన్పించింది. మా వాహనాన్ని ఆపించి నేనూ, సుంకర కృపాకరరావుగారూ, శ్రీమతి లక్ష్మీ కామేశ్వరి గారూ దిగాం. మ్యూజియంలోనికి వెళ్లాం. లోపల ఫోటోలు తీయరాదనే నిబంధనలు ఉన్నాయి. నేను వాటిని చూసుకోకుండా నా మొబైల్‌తో కొన్ని ఫోటోలు తీసాను. ఇంతలో సెక్యూరిటీ సిబ్బంది వచ్చి వారించడంతో దానిని స్విచ్ ఆఫ్ చేశాను. సాంచి కొండపై లభించిన పలురకాల బౌద్ధ అవశేషాలను ఇందులో భద్రపరిచారు. మొత్తం ఐదు హాళ్లలో వీటిని ఏర్పాటు చేశారు. సాంచి స్థూపం వద్ద జరిగిన ఆనాటి చరిత్ర పరిశోధనలను ఛాయాచిత్రాలుగా, పరిశోధకులు జాన్‌మార్షల్, దయ్యర్ తదితరులు ఉపయోగించిన వస్తు సామగ్రి, టేబుళ్లు, మ్యాపులు తదితర పురావస్తువులను కూడా జాగ్రత్త చేశారు. బుద్ధుని అవశేషాలను ఒక భరిణెలో ఉంచి దానిని సందర్శకులు చూడడానికి వీలుగా చుట్టూ అద్దాలను అమర్చారు. బుద్ధుని బోగిణిని రాతితో చెక్కి ఉంచారు. ఇందులోనే ఆనాటి బౌద్ధ భిక్షువులకు వండిన ఆహార పదార్థాలను అందించేవారు. సాంచీ తవ్వకాలలో వెలుగుచూసిన అశోక స్తంభం, బౌద్ధ భిక్షువులు ఉపయోగించిన పాత్రలు వంటివి చాలా ఉన్నాయి. సాంచీలో శిల్పాలు చెక్కడానికి ఆనాటి శిల్పకళాకారులు ఉపయోగించిన ఉపకరణాలను కూడా సందర్శకుల పరిశీలినార్థమై ఇక్కడ ఉంచారు. అక్కడ నుంచి మేము కాలినడకన దగ్గరలోనే ఉన్న శ్రీలంక మహాబోధి సొసైటీ విహార వద్దకు చేరుకున్నాము. మిగిలిన ధమ్మ మిత్రులు భోజనాలకు సిద్ధం అవుతుండడంతో అందరం ఆహారం తీసుకొని, మేము మార్కెట్లో వంటకోసం తీసుకొచ్చిన సామాగ్రిని సాయంత్రం ఐదు గంటలకు నాగపూర్ వెళ్లడానికి ట్రైన్ ఉండడంతో నాలుగున్నర గంటలకే మా లగేజీలతో విదిశా రైల్వే స్టేషన్‌కు బయలుదేరాం. మా సాంచి సందర్శనం చాలా ఉత్తేజకరంగా, మంగళకరంగా సాగింది.

**(ఇంకాఉంది)**

-రచయిత సెల్ : 73968 66888

## రచయితలకు మనవి

* రచయితలు బుద్ధభూమిలో ప్రచురణార్థం పంపించే రచనలు నిర్దిష్టంగా, ఫలానా మాసంలోనే ముద్రణ అవ్వాలని భావించినట్లయితే ఆ విషయాన్ని మీ రచనతో పాటు తెలియ జేయగలరు.
* దాని సాధ్యాసాధ్యాలను బట్టి ఆ రచయితలతో సంపాదకులు సంప్రదించడం జరుగుతుంది. అటువంటి సూచన లేని రచనలు ఎప్పటిలాగే ప్రచురించడం జరుగుతుంది.
* రచనల ముద్రణకు తగు వ్యవధి, సంపాదకులకు తగు స్వేచ్ఛ ఉన్నప్పటికీ, రచయితల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోవాలని ఈ మనవి చేస్తున్నాం.
* అలాగే పత్రికకు పంపే రచనలకు నకలు కాపీని మీ వద్ద ఉంచుకోవలసిందిగా కోరుతున్నాం. ఆయా రచనలపై రచయితలతో సంప్రదింపులకు ఉపయోగంగా ఉంటుంది.
* అలాగే రచయితలు తమ రచనలతో పాటు ఒక పాస్‌పోర్టు ఫోటో కూడా పంపగలరు.

**-సంపాదకవర్గం**

11



మంగళగిరి బుద్ధవిహార ఆధ్వర్యంలో 2015 ఫిబ్రవరి 28 నుండి మార్చి 8 వరకు జరిగిన 6వ ధమ్మయాత్ర సందర్భంగా మధ్యప్రదేశ్‌లోని సాంచీ స్థూపం వద్ద బుద్ధవిహార సభ్యులు మరియు అభిమానులు (వివరాలు 53వ పేజీలో)



సాంచి స్థూపం ప్రధాన ద్వారంపై కనువిందుచేస్తున్న అలనాటి శిల్పకళా నైపుణ్యం

# ఆంధ్రా నుంచి అజంతాకు ఆరవ ధమ్మయాత్ర

-బెందాళం కృష్ణారావు



(గత సంచిక తరువాయి-6)

## నాగపూర్‌లో రెండు రోజులు

విదిశా రైల్వేస్టేషన్‌కు చేరుకున్న మేమంతా మహారాష్ట్రలోని నాగపూర్ వెళ్లే ట్రెయిన్ కోసం గంటన్నర సమయం నిరీక్షించాల్సి వచ్చింది. ఎట్టకేలకు నాగపూర్ వెళ్లే ట్రైన్ రానే వచ్చింది. మాకు ముందుగానే రిజర్వేషన్ చేయించుకున్న బెర్తులున్నప్పటికీ మా సీట్లను మేము సంపాదించుకోవడానికి కొంత కష్టపడాల్సి వచ్చింది. మాతో పాటు తెచ్చుకున్న ఆహార పదార్థాలను తిన్నాం. ఇక నిద్రకు ఉపక్రమించాం. మార్చి 4వ తేదీ ఉదయం నాలుగున్నర గంటలకే మేము ఎక్కిన ట్రైను నాగపూర్ రైల్వే స్టేషన్‌కు చేరుకుంది. అప్పటివరకూ మేము చూసిన రైల్వేస్టేషన్లలో విజయవాడను మినహాయిస్తే నాగపూర్ రైల్వేస్టేషన్ కూడా చాలా పెద్దదిగా ఉంది. స్టేషన్ నుంచి బయటకు వెళ్లడానికి విశాలమైన రోడ్లున్నాయి. లగేజీలతో మెట్లు ఎక్కి, దిగే శ్రమ లేకుండా సునాయాసంగా లోపలికి వెళ్లడానికి బయటకు రావడానికి ఇవి ఎంతో అనువుగా ఉన్నాయి. అంతకు ముందే మా ధమ్మయాత్ర నిర్వాహకులు పామర్తి రవి గారు నాగపూర్‌లో ఎమ్మెల్సీగా ఉన్న జోగీందర్ కవాడే గారితో సంప్రదించి ఆయన సహకారంతో ఎమ్మెల్యే హాస్టల్‌లో వసతిని రిజర్వ్ చేసి ఉన్నారు. దాంతో తెల్లవారుజామునే నాగపూర్‌లో అడుగు పెట్టినప్పటికీ ఎక్కడ ఉండాలి అనే విషయంలో ఎలాంటి ఆదుర్దా లేకుండా స్టేషన్ బయటకు వచ్చాము. బయట మినీ బస్సు రెడీగా ఉండటంతో అందులో ఎక్కి ఎమ్మెల్యే హాస్టల్‌కు చేరుకున్నాం. ఎమ్మెల్యే హస్టల్ భవనాలే కాదు వాటిలో ఉన్న గదులు కూడా చాలా విశాలమైనవి. రవిగారు ఇద్దరు ముగ్గురు ధమ్మమిత్రులకు ఒక్కో గదిని కేటాయించారు. సాంచీ వరకూ మాతో వచ్చిన ధమ్మ మిత్రులు సుంకర కృపాకర రావుగారు, ఆయన సతీమణి లక్ష్మీకామేశ్వరిగారు అనివార్య కారణాలవలన వేగంగా విజయవాడు వెళ్లాల్సివచ్చింది. మేమంతా మా రూములకు చేరుకుని కాలకృత్యాలను తీర్చుకున్నాం. హాస్టల్ ఆవరణలో వంట ఏర్పాట్లు చేసుకోవడానికి తగిన స్థలం కోసం వెతికాము. అయితే కొన్ని కారణాల వలన అది సాధ్యం కాదని తేలింది. బయట హోటళ్లపైనే భోజనానికి, అల్పాహారానికి అధారపడక తప్పదని తేలింది. ఎమ్మెల్యే హాస్టల్ ప్రహరీ బయట రుచికరమైన ఇడ్లీ, దోసెలు అమ్ముతుండటంతో వాటిని కొనితిన్నాం. వాటిని అమ్మే అతనితో మాట్లాడగా తేలిందేమిటంటే అతను శ్రీకాకుళం జిల్లాకు చెందినవాడేనని, ఒకవైపు టిఫిన్లు బండిపై అమ్ముకుంటూనే పది గంటల తర్వాత నుంచి ఒక హోటల్‌లో కూడా పని చేస్తానని అతను మాకు వివరించాడు. అల్పాహారాలు ముగించి అందరం ముందుగానే బుక్‌చేసుకున్న బస్‌లో 'దీక్షాభూమి'కి వెళ్లాం. నాగపూర్ పట్టణానికి ఐదుకిలో మీటర్ల దూరంలో ఉన్న ఈ దీక్షాభూమి కూడా ప్రస్తుతం పట్టణంలోనే ఉన్నట్లు కన్పిస్తుంది. 1956 అక్టోబర్ 14వ తేదీన డా॥బి.ఆర్.అంబేద్కర్

హిందూ సమాజంలో నిమ్నస్థాయిలో ఉన్న సుమారు ఐదు లక్షల మంది దళితులకు ఈ స్థలంలోనే బౌద్ధధర్మదీక్షను తనతో పాటు ఇప్పించారు. ఆ ప్రభావం ఇప్పటికీ నాగపూర్‌లో ప్రతిచోటా మాకు కన్పించింది. ఈ పట్టణంలో ఉన్న హిందూ దేవాలయాల కన్నా బౌద్ధ నిర్మాణాలే అధికంగా ఉన్నాయి. ఈ దీక్షాభూమిలో అనాటి మహత్తర సంఘటనకు గుర్తుగా పెద్ద స్థూపాన్ని నిర్మించారు. ఈ స్థూపాన్ని సుప్రసిద్ధ ఆర్కిటెక్టు షెయోదాన్‌మాల్ డిజైన్ చేసారు. దీని నిర్మాణానికి 23 సంవత్సరాలు పట్టింది. సాంచీ స్థూపాన్ని పోలిన విధంగా ఈ నిర్మాణం సాగింది. దీనిని 2001 డిసెంబర్ 18న భారత రాష్ట్రపతి డాక్టర్ కె ఆర్ నారాయణ్ ప్రారంభించారు. ఈ స్థూపంలోకి మేమంతా వెళ్లాం. లోపల 211 చదరపు అడుగుల విస్తీర్ణంలో పెద్ద హాలు ఉంది. హాలు మధ్యలో బుద్ధుని విగ్రహం, అంబేద్కర్ ఫొటో ఉన్నాయి. గోడలకు అంబేద్కర్ జీవిత దృశ్యాలు, ధమ్మదీక్షకు సంబంధించిన ఛాయాచిత్రాలు అనేకం ఏర్పాటు చేశారు. గౌతమ బుద్ధుని జీవిత సంఘటనల తైలవర్ణ చిత్రాలు కూడా చాలా ఉన్నాయి. మేమంతా ఈ హాలులో చాలా సమయం గడిపాము. దీక్షాభూమి ఆవరణలో గల పుస్తకాల షాపులో పుస్తకాలు కొనాలని అనుకున్నాం. అయితే ఆ రోజు ఎందుకో దానిని తెరవలేదు.

దీక్షాభూమి బయటన గల ఫుట్‌పాత్‌పై అమ్ముతున్న పలు పుస్తకాలను చూసాం. వాటిలో ఇంగ్లీషు పుస్తకాల కన్నా హిందీ, మరాఠీ భాషల్లో రాసిన పుస్తకాలే ఎక్కువగా ఉన్నాయి. అక్కడి నుంచి బస్సులో బయలుదేరి మేము నాగలోక్ అనే ప్రాంతానికి వెళ్లాలనుకున్నాం. దారిలో బస్సులో డీజిల్ పోయించుకుని అక్కడే ఐస్‌కాండీలు అందరమూ తిన్నాం. బస్సులో నాగలోక్ చేరుకున్నాం. అక్కడ సువిశాలమైన ప్రదేశంలో నిర్మించిన విద్యాలయం, విద్యార్థుల వసతి గృహాలు, కేంటీన్, పుస్తకాలు, ఫొటోలు, శిల్పాలు ఇతర వస్తువిక్రయశాల అన్నీ ఉన్నాయి. అన్నింటి కన్నా అక్కడ మాకు బాగా ఆకర్షించింది సుమారు ఎనభై అడుగుల ఎత్తు వున్న బుద్ధుని విగ్రహం. అది ఆధునిక కాలంలో నిర్మించినదైనా అత్యంత ఆకర్షణీయంగా ఉంది. దాని దగ్గర కూర్చొని, నిల్చొని చాలా ఫొటోలు తీయించుకున్నాం. ధమ్మమిత్రులు నందం నర్సింహరావు ఫొటోలతోపాటు వీడియో కూడా తీసారు. ఈ నాగలోక్‌లో అందమైన ఉద్యానవనాలుగా దారికి ఇరువైపులా అత్యంత శ్రద్ధతో పూలమొక్కల పెంపకం జరుగుతోంది.





అక్కడ ఉన్న పుస్తక, వస్తు విక్రయశాలలోకి అందరం వెళ్లాము. మాకు నచ్చిన పుస్తకాలు, సీడీలు, బుద్ధుని బొమ్మలు, ఇతర వస్తువులను కొనుగోలు చేశాము. పక్కనే ఉన్న మెస్‌కు వెళ్లాము. మాకు భోజనాల ఏర్పాట్ల గురించి అక్కడివారితో పామర్తి రవి మాట్లాడారు.

అక్కడి వంటశాలలో తెలుగు తెలిసిన మహిళ కూడా ఒకరున్నారు. ఆమె తనది శ్రీకాకుళం జిల్లాలోని మందస ప్రాంతమని చెప్పారు. మెస్ హాలులో కొంతమంది విద్యార్థులతో పాటు మేము కూడా రుచికరమైన భోజనం చేశాం. బుద్ధిజం, అంబేద్కర్ స్టడీస్ తదితర కోర్సులు మాత్రమే ప్రత్యేకంగా ఈ విద్యాలయంలో బోధిస్తారని విద్యార్థులు చెప్పారు. తెలంగాణ రాష్ట్రానికి చెందిన విదార్థులు కూడా ఇక్కడ మమ్మల్ని కలిసి ముచ్చటించారు. మధ్నాహ్నం మూడు గంటల వరకూ అక్కడే గడిపిన మేము బస్సులో తిరిగి బయలుదేరాము. దారి పొడవునా వివిధ బౌద్ధ విహారాలని సందర్శించుకుంటూ సాయంత్రానికి డ్రాగన్ ప్యాలెస్ అనే బౌద్ధ విహారం వద్దకు చేరాము. లోపలకు వెళ్తుంటే ఎంతో పచ్చదనంతో అంతా ప్రశాంతంగా కన్పించింది. చైనా–జపాన్ నిర్మాణశైలిలో దీనిని నిర్మించారు. పూర్తిగా అద్దాలతో త్రిభుజాకారంలో పెద్దదిగా ఉంది. మధ్యలో పాలరాతితో చెక్కిన బౌద్ధ విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. లోపల ప్రశాంతంగా ఉండడంతో మేమంతా కాసేపు అందులో కూర్చొన్నాం అక్కడనుంచి బస్సులో బయలుదేరిన మేము మరికొన్ని విహారాలను చూశాము. ఆధునిక కాలంలో వీటిని నిర్మించారు. హిందూ అలయాలకు వెళ్తున్నట్లే స్థానికులు ఈ విహారాలను సందర్శిస్తూ బుద్ధుని విగ్రహాలకు నమస్కారం చేసి విరాళాలు సమర్పించుకుంటున్నారు. కొన్ని విహారాల్లో బౌద్ధ దీక్ష పొందిన బాలలు కూడా చాలామంది ఉన్నారు. వారికి పండ్లు, బిస్కెట్లు అందజేశాము. రాత్రి సమయానికి ఎమ్మెల్సీ జోగిందర్ కవాడే నివాసానికి వెళ్లాము. చాలా నిరాడంబరమైన జీవితాన్ని ఆయన, ఆయన భార్య అక్కడ గడుపుతున్నారు. తెలుగు రాష్ట్రాల్లోని రాజకీయ నాయకుల దర్పానికి భిన్నంగా ఒక అపార్ట్‌మెంటులోని సింగిల్ బెడ్‌రూమ్ ఫ్లాట్‌లో ఆ దంపతులు నివాసం ఉంటున్నారు. వారిద్దరూ మా బృందాన్ని ఎంతో అభిమానంతో, అత్మీయతలతో పలకరించి టీలు, ఫలహారాలు అందించారు. అక్కడే కొంత సమయం గడిపి ఆయనతో ఫొటోలు దిగాం. తాను చాలా సార్లు ఆంధ్రప్రదేశ్‌కు వచ్చానని చెప్పారు. ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లా వంగర మండలం లక్షింపేటలో 2012 జూన్ నెలలో దళితులపై

